# శరశ్చంద్రఛటర్జీ



"ఇది తప్పక రవీంద్రుడు రచించి ఉంటాడని నా నమ్మకం. ఒక్క నేనే కాదు. నాతో యింకా చాలామంది ఏకీభవిస్తారు."

"రవీంద్రుడు పేరు లేకుండా ఏదీ ప్రకటించలేదు. ఇది వారి రచన ఎలా అవుతుంది?"

"సరే నీ మాట ప్రకారం వారిది కాదనుకుందాము. ఇంత చక్కగా వ్రాయ గలిగినవారి పేరు ఇంకొకటి చెప్పు?"

ఈ ప్రశ్నకు జవాబు చెప్పటం అప్పుడు కష్టం. బంగాలీ సాహిత్యాకాశంలో రవీంద్రుడు చంద్రునిమాదిరిగా వెలిగిపోతున్నాడు బంకిమ చంద్రుడు ఎప్పుడో అస్తమించాడు. రవి మధ్యాహ్నదశలో ఉన్నాడు.

అసలు. పై తర్కానికి కారణమైంది 'బడదీదీ' అనే నవల. దీన్ని 'భారతి' అను మాస పత్రిక-ఆ కాలంలో ఇది ప్రముఖ పత్రిక-వరుసగా ప్రకటించింది. కాని రచయిత పేరు వేయలేదు. అప్పుడు ఆ రచయిత 'ఎవరై ఉంటా'రని జరిగిన వాదోప వాదాలనుబట్టి రచన బంగాలీపాఠకులను ఎంతగా ఆకర్షించిందీ తెలుస్తున్నది. ఒక్క పాఠకులలోనే కాదు. సంపాదకులలోకూడా దీని విషయమై బాగానే చర్చ జరిగింది. చివరకు ఒక మాసపత్రికా సంపాదకులు 'భారతి' పత్రికలు తీసుకుని శాంతినికేతనానికి వెళ్లి రవీంద్రునికి యిచ్చి — 'ఈ రచన తమది అవునోకాదో తేల్చండి' అని కూర్చున్నాడు. రవీంద్రుడు నవల మొదటినుంచి చివరవరకు ఒక్క బిగువున చదివి "కథ చాలా బాగుంది కాని రాసింది నేనుకాదు" అని, అప్పుడే 'భారతి' సంపాదకునికి- "'బడదీది' నేనే రాశానని చాలామంది అపోహపడుతున్నారు. కాబట్టి దాని రచయితను వెంటనే బయటపెట్టవలసిందని" ఉత్తరం రాశాడు. మరుసటి సంచికలో వెలువడినది.

"బ డ దీ దీ"

రచయిత :-

శ్రీ శరత్ చంద్ర ఛట్టోపాధ్యాయ

ఎవరీ శరత్ చంద్రుడు? ఇదివరకు ఈ పేరు ఎక్కడా చూడలేదే! ఎక్కడైనా

మారుమూల పత్రికల్లో వీరి రచనలు దొరుకుతాయా? అని చాలామంది వెదికారు. కాని లాభం లేకపోయింది. పోనీ వీరి క్రొత్త రచన ఏదైనా వస్తుందా అని కొన్నాళ్లు ఎదురు చూశారు ఇటూ నిరాశే కలిగింది నిమ్మళంగా వీరిని మరచిపోయారుకూడా. 'బడదీదీ' ౧౯౦౭ ఏప్రియల్ మాసంలో ప్రకటితమైంది. కాని ఈ సంగతి శరత్ బాబుకి తెలియదు. ఇతని మిత్రుడు 'శిఖ' అను రాతపత్రికనుంచి ఎత్తి దీనిని భారతికి ఇచ్చాడు.

తర్వాత, ఏడెనిమిది సంవత్సరాలకు 'యమున' అనే మాసపత్రికలో 'బిందుర ఛేలే' అను నవల, వీరిపేరుతో వరుసగా ప్రకటితము కాసాగింది. తర్వాత 'రామేర సుమతి'అనే కథకూడా ప్రకటితమైంది. ఈరచనలు ఎలా ఆదరం పొందినవో చూద్దాం.

"బిందురఛేలే" పడకముందు "యమున"కు చందాదార్లు ౫౦౦ మంది మాత్రమే. ఈ రచన పడిన తర్వాత క్రమంగా ౫౦౦౦ వరకూ హెచ్చారు. చిత్రమేమంటే ఈ పత్రిక వీరి రచనలతోనే వృద్ధిలోకి వచ్చింది — వృద్ధిలోకి రావటంకాదు, జీవించింది! నశించటానికి కారణం "చరిత్రహీన్" అనే నవల.

ఈ నవల పడడం మొదలుపెట్టిన కొంత కాలానికి ఈ రచనను ప్రకటించవద్దని సంపాదకునికి చాలా జాబులు వచ్చినవి. కాని సంపాదకుడు వాటిని లెఖ్ఖచేయలేదు. చివరకు, అందరూ ఏకోన్ముఖంగా ఆపత్రికను బహిష్కరించారు. బాగా ఉందనుకుని విసిగబడటంలోనూ వద్దనుకుని తోసివేయటంలోనూ బంగాలీలు అప్పటికే సమర్థులు!

ఇంతకూ ఆరచనలో (అప్పటికి ప్రకటితమైనంత వరకు) ఏమున్నది? ఒక కాలేజీ స్టూడెంటు— కులీనుడూ, ధనికుడూ-మెస్‌లో ఉండే దాదీని ప్రేమిస్తాడు! ఇదే కారణం. దీనికే పత్రికను బహిష్కరించటమా? ఈ స్వల్పకారణం కొంతవరకు పనిచేసినమాట వాస్తవమేకాని ఈ ఉద్యమానికి ఇంత విజయం కలగటానికి ముఖ్యులు రవీంద్రుని అనుచరులూ, పత్రికలూ. శరత్—తాగుబోతనీ, అనాగరికుడనీ, నడత మంచిదికాదనీ, నీచజాతులతో కలిసిమెలిసి ఉంటాడనీ ఏమేమో ప్రచారం చేశారు. కాని నిప్పును ఊక ఎంతకాలం కప్పిపెడుతుంది?

చివరకు దానిలో కాలి భస్మమైపోయింది. అతని ప్రతిభను అందరూ ఒప్పుకున్నారు; జోహారులు చేశారు. బెంగాలులోని ప్రతి సంస్థా, ప్రతివ్యక్తీ వీరిని గౌరవించింది.

కలకత్తా యూనివర్సిటీ జగత్తారిణీ పతకం వీరిని బహూకరించింది. ఢాకా-

యూనివర్సిటీ డి. లిట్. బిరుదనిచ్చింది ౧౯౩౬ లో వీరిని బంగాలీ అందరూ కలిసి కలకత్తా టౌన్‌హాలులో సన్మానించారు:— "శరత్ వందన" అను పేరుతో గొప్ప ఉత్సవం చేశారు. ఆనాడు సభలో వీరిని ప్రశంసించుతూ చదివినవన్నీ కలిపి "శరత్ వందన" అనుపేరులో వారే పుస్తకరూపంగా ప్రకటించారు ఇక్కడ రవీంద్రుడు (౧౯౩౮) అన్న ముక్కలు రెండు ఉదహరించి ప్రసంగం ముగిస్తాను.

"శరత్ చంద్రునిదృష్టి బంగాలీల హృదయమర్మాలలో మునిగితేలింది. సుఖంలో, దుఃఖంలో, కలయికలో ఎడబాటులో ఘటిల్లుతూ ఉండేటటువంటి విచిత్ర సృష్టిని అతడు బంగాలీల కళ్ళకు కట్టినట్లుగా వర్ణించాడు దీనికి నిదర్శనం బంగాలీలు తరుగని ఆనందమే బంగాలీలు ఆంతరంగికంగా వీరి రచనలతో తృప్తిపడ్డంత మరి ఏ రచయిత రచనలతోనూ తృప్తి పడలేదు. ఇతర లేఖకులు చాలామంది గొప్ప గొప్ప ప్రశంసలు పొందారు. కాని ఇలా అందరి హృదయాతిథ్యములూ స్వీకరించలేకపోయారు."

★ • ★ ★

ప్రతివ్యక్తీ—అతను ప్రఖ్యాతిచెందిన వాడుకానీ; అపఖ్యాతికి పాలయినవాడు కానీ, పతితుడుకానీ, పావనుడుకానీ. ఏదో ఒకఘడియను జన్మిస్తాడు, మరణిస్తాడు కూడా కాని మనం ఈ హెచ్చుతగ్గులు వాళ్లు పుట్టిన నక్షత్రానికో, వేళావిశేషానికో ఇస్తూఉంటాము. మహాత్మా గాంధి జన్మించిన ఘడియనే ఈ విశాల ప్రపంచంలో యింకా ఎంత మంది జన్మించిఉంటారు? ఏదీ, మరో మహాత్ముడు కనపడడే! హిమాలయాల్లో నుంచి ఎన్నినదులు పుట్టినవి? పతితోద్ధారిణి అనే బిరుదు ఒక్క గంగకే లభించిందే! ఈ ప్రపంచంలో చాలామంది గొప్పవారి జన్మతిథులు తెలియవే! కనీసం కాలనిర్ణయంకూడా కాలేదే! అయినా జన్మతిథి తెలిసిఉంటే చెప్పటం ఆచారం. ఈ పరంపరాగత ఆచారాన్ని నేనూ వదలను.

శరచ్చంద్రుని జననం ౧౫—౯—౧౮౭౬ వీరికి ఇద్దరు తమ్ములు కూడా ఉన్నారు—ప్రభాసచంద్రుడు, ప్రకాశచంద్రుడు. వీరిది కులీన బ్రాహ్మణవంశము. ప్రభాసుడు సన్యసించాడు. ౧౯౩౦ లో చనిపోయినాడు. శరచ్చంద్రునిది బీదకుటుంబము. వీరి బాల్యం మేనమామలయింట భాగల్పూరులో గడచింది. అక్కడనే స్కూలుఫైనలు పూర్తిచేసి, ఇంటరు చదువుతూ చదువుమాని, దేశాలమీద వెళ్లిపోయినాడు. ఎప్పుడైనా మధ్యమధ్య భాగల్పూరు వచ్చినా ఎక్కువరోజులు ఉండేవాడు కాదు. మళ్ళీ ఎటో వెళ్లిపోయేవాడు. ఎక్కడా ఉద్యోగంకూడా పట్టుమని

నాలుగునెలలు చేయలేదు. అప్పుడు ఎక్కడెక్కడ తిరిగాడో, ఏమేమి చేశాడో, ఏ చరిత్రకారుడూ వ్రాయలేదు. (నమ్మతగింది) వీరూ బయటపెట్టలేదు. ఆరహస్యం వారితోపాటు చితిలో భస్మమైపోయింది.

౧౯౦౩ ప్రాంతాల వీరు రంగూనుపోయి ౧౯౦౪ లో ఎకౌంటెన్సీ ఆఫీసులో ఉద్యోగం సంపాదించుకొని కొంతకాలం అక్కడనే ఉన్నారు. అప్పుడు రవీంద్రుడు ఇండియాలోలేడు. పశ్చిమ యాత్రకు పోయినాడు. వారు వదలిన బంగాలీ సాహిత్యాకాశంలో శరత్‌చంద్రుడు తూర్పున ఉదయించి, నిండు కళలతో, మలిన రహితమైన చంద్రికలు వెదజల్లినాడు. మధ్య ఒకమాటు మేలిమబ్బుకమ్మినా, అది వారి కాంతిని హెచ్చించిందే కాని తగ్గించలేదు. అస్తమించేవరకు అదేకాంతితో ప్రకాశించినాడు. ఈ ప్రపంచంలో చాలామంది మాదిరిగా వీరు ప్రతిష్ఠా శిఖరాన్ని ఒక్కొక్కమెట్టే ఎక్కలేదు; ఒక్కమాటే దానిపైకి ఎగిరి కూర్చున్నారు చాలా మందివలె అక్కడనుంచి దిగనూలేదు; చివరివరకూ అదే గౌరవంతో తన ఆసనాన్ని కాపాడుకున్నారు.

వీరిరచనలు "యమున"లో పడటం మొదలుపెట్టినాక, వీరు ప్రతిభావంతులని తెలుసుకుని "భారతవర్ష" పత్రికాధిపతులు (గురుదాస చటర్జీ అండు సన్సు) వీరిని రంగూనునుంచి పిలిపించి నెలకు నూరు రూపాయల జీతంమీద తమ ఆఫీసులో ఉద్యోగం ఇచ్చారు. యమునలో పడిన కథలు "బిందురఛేలే" అనుపేరుతో సంపుటిగా ప్రకటించుకోవటానికి మొదట వీరు ఒక పబ్లిషరుకు అనుమతి ఇచ్చారు. కాని మొదటి సంస్కరణ మూడుమాసాలకే అమ్ముడుపోయేవరకు, రెండవ సంస్కరణ తానే ప్రకటించుకుని గురుదాస చటర్జీ అండ్ సన్సు వారికి డిస్ట్రిబ్యూటింగ్ అధికారం ఇచ్చారు. తర్వాత ఇలాగే కొన్నితప్ప మిగతావన్ని సొంతంగా ప్రకటించుకున్నారు. రచనలమీద వీరు సంపాయించినంత డబ్బు హిందూదేశంలో ఎవ్వరూ సంపాదించ లేదు. తర్వాత కొన్నాళ్ళకు కలకత్తావస్తే "యమున" పత్రికా సంపాదకుడు తన పత్రికకు ఏమైనా రాయమని బలవంతపెట్టగా శరత్‌బాబు "బిందురఛేలే" ఇచ్చాడు.

దేశబంధు చిత్తరంజనదాసు 'నారాయణ' అనే పత్రిక కొంతకాలం నడిపాడు. దానికి ఒక కథను తప్పక పంపమని కోరుతూ దానికి శరత్ చంద్రునికి 'బ్లాంక్‌చెక్' పంపాడు. శరత్‌బాబు కథ పంపి నూరు రూపాయలు మాత్రం వేసుకున్నాడు.

వీరి ప్రథమ రచన ఫలానిదని చెప్పటం కష్టం. స్కూల్లో చదువుతున్న రోజుల్లో వీరూ, వీరి మేనమామలూ కలిసి 'శిశు' అనే పేరుతో వ్రాతపత్రిక ఒకటి

ప్రకటించేవారు. దానిలోనే దేవదాసు, బడదీదీ, చంద్రనాథ, ఛబి (అనువాదం) ఇంకా కొన్ని కథలు వెలువడినవి.

'మందిర్' అనే కథ మేనల్లుడు బలవంతపెట్టగా స్టోరీ కాంపిటీషనుకు రావి ఇచ్చాడు. కాని కుర్రవాడు తండ్రి, సురేంద్రనాధ గంగోపాధ్యాయ పేరుతో 'ప్రతియోగిత'కు పంపాడు. దీనికి ప్రధమ బహుమానం వచ్చింది. కాని, ఈ సంగతి కొన్నాళ్ల దాకా శరత్‌బాబుకు తెలియదు.

'నారీరమూల్య'అనే వ్యాసం ఒకటి వీరి అక్కయ్య అనిలాదేవి పేరుతో ప్రకటించారు. దీనిలో విద్వాంసుల అభిప్రాయాలు క్రోడీకరించి, ఆటవికుల దగ్గరనుంచి నాగరికులవరకు, స్త్రీలను ఎలా చూస్తున్నది, ఎంతవిలువ యిస్తున్నదీ చర్చించారు.

'శుభదా' అనే నవల ఒకటి కూడా రాశాడు. కాని ప్రకటించలేదు. దీన్ని వీరు చనిపోయినాక ప్రకటించారు.

మొన్న ఈ మధ్యనే 'పథేర్‌దాబీ' మీద బెంగాల్ ప్రభుత్వం నిషేధం తొలగించింది.

వీరి రచనలన్నీ కలిసి యాభైదాకా ఉంటవి.

వీరి కథలన్నీ క్లుప్తీకరించిన నవలల్లాగుంటవి. విపరంగా రాస్తే నవలలకు సరిపోయే సామగ్రి వీటిలో ఉంటుంది. తెలుగులో అనువదింపబడిన వీరి కథలు చదివితే ఈ సంగతి తెలుస్తుంది

వీరి రచనలు చాలా ఇంగ్లీషులోకి, ఫ్రెంచిలోకి అనువదింపబడినవి. విశేష ప్రశంసలనుకూడా పొందినవి. దేశభాషలసంగతి చెప్పనక్కరలేదు. దాదాపు అన్నిటిలోకి ఒకటో రెండో వచ్చినవనవచ్చును.

ఈ క్రిందివి తెలుగులోకి వచ్చినవి.

అరక్షణీయ, రాముని బుద్ధిమంతనం, తీరని కోరికలు, సీమంతిని (విరాజబౌ) శ్యామల (దేవదాసు) మాధవి (బడదీదీ) లలిత (పరిణీత) చంద్రనాధ, అంధకారంలో ప్రకాశం, హరిచరణ, పెంచిన ప్రేమ (మామలారఫల్) పతివ్రత.

★ ★ ★

"నేను తరచు పాపుల చరిత్రనే వర్ణించాను-బహుశా వారు పాపంకూడా చేసి ఉండవచ్చు. అంతమాత్రానే వారికి ఉరిశిక్ష వేయవలసిందేనా? మనుష్యుని ఆత్మను నే నెప్పుడూతిరస్కరించలేదు. ఎవరినైనా సరే, 'నువ్వు పాపివి' అని అంటానికి నాకు

రైలురోడ్డుపేసే కూలీలది. పిల్ల ఉండేచోటు రైలువాగెన్లు. వీళ్ళలో చాలామంది కలరాతగిలి చనిపోతూ ఉంటారు. తల్లీ కొడుక్కూ తగిలిఉన్నది:

"నీళ్లు" అన్నాడు కుర్రవాడు. నేను కుర్రవాడి ముఖందగ్గరకు వంగి- ఎఱు లేపు నాయనా. ఉదయం యిస్తాను" అన్నాను కుర్రవాడు "సరే" అన్నట్టు తల తిప్పాడు. తర్వాత నిశ్శబ్దంగా కళ్లు మూసుకున్నాడు.

"దప్పిక తీర్చటానికి నీళ్లు లేకపోయినవిగాని నాకళ్ళనుంచి ఏకధారగా నీళ్ళు కారుతున్నవి! ఇది మానవుని సుకుమార ప్రవృత్తికాదు, ఉదాసీనత! పశువు అంటే ఇటువంటివాడే! ఇది ధైర్యశక్తి కాదు, జడత్వం, ఈ సహిష్ణుతకంటె మానవత్వానికి అధోగతి మరొకటి ఉండదు!

"మా ట్రక్కులో ఉన్నవాళ్ళంతా గుండెమీద చేయివేసుకుని నిద్రపోతున్నారు. హరికెన్ లాంతరుకు మసివేసింది నేను ఆ గుడ్డివెలుతురులోనే తల్లీ కొడుకుల శరీరం కండెలు కట్టిపోవటం చూశాను. కాని నేను చేయగలిగింది ఏ మున్నది?

"ఎదుట, నీలాకాశంలో చాలాచోటు ఆక్రమించుకొని సప్తర్షిమండలం ధగధగ మెరుస్తున్నది. నేను అటువైపు చూసి, వేదనతో, క్షోభతో, నిష్ఫల ఆక్రోశంతో శపించ నారంభించాను:

"ఆధునిక సభ్యతకు" వాహనములైన మీరు చావండి! కాని ఏ హృదయ విహీన సభ్యులైతే మిమ్మల్ని యిలా పట్టుకు పీడిస్తున్నదో, దాన్నిమాత్రం మీరు క్షమించకండి. దాన్ని మీరు మోయక తప్పనట్టయితే సాధ్యమైనంత వేగంతో రసాతలానికి తీసుకుపోండి." (శ్రీకాంత—చతుర్థపర్వం)

★ ★ ★

"తమరు నాకేమి సలహా యిస్తారు?" ఒక లేఖకుని ప్రశ్న.

"నేనేమి ఇచ్చేది? నాకు మా పంతులు ఇచ్చిన ఉపదేశమే నీకూ ఇస్తున్నాను. ఒకమాటు మా పంతులు నన్ను చూచి, 'ఏమోయి శరత్! నువ్వు బాగా రాస్తూన్నా వటే. నాకు ఒకట్రెండు చదివి చూపించవేమి?' అన్నారు. నేను 'తమబోటివారు చూచే టంత విశేషమేమీ లేదు నా రచనల్లో' అన్నాను సంకోచిస్తూ. అప్పుడు వారు, 'సరే, నువ్వు యివ్వకపోతే ఇంకొకరిదగ్గర తీసుకొని చదువుకుంటాను. నువ్వు రాస్తున్నా వంటే నాకు సంతోషంగా ఉంది. కాని, శరత్! రెండువిషయాలు మాత్రం జ్ఞాపకం పెట్టుకో. ఒకటి వ్యక్తిగతంగా ఎవ్వరినీ విమర్శించబోకు; రెండోది, నీకు అనుభవం లేని విషయాన్ని తీసుకుని నీవు ఏమీ రాయవద్దు' అని చెప్పారు. ఇదే నీవుకూడా అనుసరించమని నా సలహా." ఇది శరచ్చంద్రుని జవాబు.



ఇంద్రజిత్తు ప్రయోగించిన శక్తివచ్చి హృదయంమీద నాటినప్పుడు లక్ష్మణుని ముఖం తప్పక వికృతినిచెంది ఉండవచ్చును; కాని గురుచరణుని ముఖం—ఉదయం లేవగానే భార్య యిప్పుడే నిర్విఘ్నంగా ఐదవ కుమార్తెను కనినదన్న కబురు విన్నపుడు, అసలు గుర్తించటానికే వీలు లేకుండా పోయింది.

గురుచరణుడు బ్యాంకు గుమస్తా. నెలకు అరవై రూపాయల జీతం. బాడుగబండి తోలే గుర్రం మాదిరిగా అతని దేహం శుష్కించి పోయింది. ముఖంలోనూ కళ్ళలోనూ అలాంటిదే ఒక నిష్కామనిర్వికార నిర్లిప్తభావం గోచరిస్తూ ఉంటుంది. అయినా ఈ భయంకర శుభవార్త వినేసరికి అతని చేతులోని హుక్కా అలానే ఉండి పోయింది. పితృదత్తమైన పురాతనపు దిండును ఆనుకొని ప్రతిమవలె కూర్చున్నాడు అతనిలో నిట్టూర్పు విడిచే శక్తికూడా లేకుండా పోయింది.

ఈ శుభవార్త కొనితెచ్చింది అతని మూడవ కుమార్తె అన్నాకాళి. ఇప్పుడు పదో యేడు—"నాన్నా! అమ్మాయిని చూద్దుగాని రా!" అని అడిగింది.

గురుచరణుడు కుమార్తె ముఖంవంక చూస్తూ—"తల్లీ! ఒక గ్లాసు నీరు తీసుకురా! దాహం అవుతున్నది." అన్నాడు.

కుమార్తె నీరు తీసుకురావటానికి పోయింది. పిల్ల వెళ్ళిపోయిన తరువాత అతనికి మొట్టమొదట జ్ఞాపకం వచ్చింది సూతికాగృహపు ఖర్చు.

తర్వాత, ప్రయాణీకులు ఎక్కువగా ఉన్న రోజున స్టేషనులోకి బండిరాగానే తెరచి ఉన్న తలుపు చూచి మూడవ తరగతి ప్రయాణీకులు ముటాముల్లే చేతపట్టి ఉన్మత్త భావంతో ముసలీ ముఃకను త్రొక్కివేస్తూ పెట్టెలోకి ఎలా దూకుతారో, అలాగే అనేక దుశ్చింతలు ఒక్కసారిగా అతనిబుర్రలో అట్టహాసం చేస్తూ ప్రవేశింప నారంభించినవి—

గత సంవత్సరం రెండో కుమార్తె శుభ వివాహానికి తండ్రి ‹ంపా దించిపోయిన రెండంతస్తుల మేడా తాకట్టు పెట్టాడు; ఇప్పుడు అసలు కింక ఆరుమాసాల వడ్డీకూడా తోడయింది, దసరాపండుగ దగ్గరకు వచ్చింది; పెద్ద కుమార్తెకు సూడిద పంపాలి. రాత్రి ఎనిమిది గంటలదాకా ఆఫీసులో కూర్చున్నా జమాఖర్చులు కలవలేదు; ఇవ్వాళ పన్నెండు గంటల లోపలనే లెక్కలు విదేశాలకు పంపాలి. మురికిగుడ్డలు వేసుకుని ఆఫీసుకు వెళ్ళితే పెద్దదొర జరిమానా వేస్తాడు. ఇటు వారం రోజులనుంచి చాకలివాని జాడలేదు; ఈ కుటుంబములోని సగం గుడ్డలకు పైగా తీసు కొని వాడెటో పారిపోయాడు. ఇలాంటివి యింకా ఎన్నో దుశ్చింతలు అతన్ని ఆవరించినవి. గురుచరణుడు ఇక దిండుకు ఆనుకొనిగూడా కూర్చోలేకపోయాడు; హుక్కా పైకెత్తి జారబడి భగవంతుని ఉద్దేశించి ఇలా ప్రార్థించాడు—

"భగవంతుడా! కలకత్తాలో రోజుకు ఎంతోమంది బండ్లక్రింద పడి చస్తున్నారు. వారు నాకంటేకూడా నీకు ఎక్కువ అపగాధం చేశారా? దయామయా! నీ దయవల్ల ఒక పెద్ద మోటారుకారు నా గుండెమీదుగా పోకూడదా?"

అన్నాకాళి వచ్చి నీళ్ళగ్లాసు అందిస్తూ "నాన్నా! లే, నీళ్లుతెచ్చాను." అన్నది. గురుచరణుడు లేచి నీరంతా ఒక్క గుక్కను తాగివేసి—"ఆ, ఇక పో తల్లీ! గ్లాసు పట్టుకుపో." అన్నాడు.

పిల్ల వెళ్ళిపోయిన తర్వాత గురుచరణుడు తిరిగి పండుకున్నాడు. లలిత గదిలోకివచ్చి—"మామా! టీ తెచ్చాను, లే!" అని అన్నది.

టీ మాట వినగానే గురుచరణుడు మరల లేచి కూర్చున్నాడు. లలిత ముఖం చూసేసరికి అతని కోపం సగం తగ్గిపోయింది. "రాత్రంతా మేల్కొన్నావు కామాలు తల్లీ, ఇలా రా!" అని పిలిచాడు.

లలిత సలజ్జహాసంతో దగ్గరకువచ్చి—"రాత్రి నే నెక్కువసేపు మేలు కోలేదు, మామా!" అన్నది.

నానావిధ కౌటుంబిక ఉత్సాహాలవల్ల అకాలవృద్ధుడైన మాతులుని ప్రచ్ఛన్న హృదయవేదన ఈపిల్లకంటే బాగా గ్రహించినవారు ఈ కుటుం బంలో యింకెవ్వరూలేరు.

"అలాగే గాని దగ్గరకు వచ్చి కూర్చో" అన్నాడు గురుచరణుడు.

లలిత దగ్గరకు వచ్చి కూర్చోగానే గురుచరణుడు ఆ పిల్ల తల నిమురుతూ—"మా యీ తల్లిని మంచి భాగ్యవంతుని చేతిలో పెట్టగలిగితే అప్పుడు నేనొక సత్కార్యం చేశానని అనుకొంటాను!" అని అన్నాడు.

లలిత తల వంచుకొని 'టీ' కప్పులో పోస్తూన్నది.

"ఏం తల్లీ! నువ్వీదరిద్రుని యింట్లో రాత్రిం బగళ్ళు కష్టపడటం లేదూ?"

"కష్టమేముంది మామా! అందరూ పని చేస్తున్నారు నేనూ చేస్తు న్నాను" అన్నది కష్టము లేదన్నట్లు తల త్రిప్పుతూ.

ఈ మాటకు గురుచరణుడు నవ్వి "సరే తల్లీ! ఇవాళ వంట ప్రయ త్నాలేమైనా ఉన్నాయా?" అని టీ త్రాగుతూ అడిగాడు.

"ఎందుకు లేవు మామా! నేను వండుతానుగా!" అన్నది లలిత మామ వంక జూస్తూ.

"నువ్వు వండుతావా తల్లీ! నీకు వంట తెలుసా?" అని గురుచర ణుడు ఆశ్చర్యముతో అడిగాడు.

"తెలుసును మామా! అత్తయ్య దగ్గర అంతా నేర్చుకున్నాను."

"నిజంగా?"

"నిజంగా, అత్తయ్యకు తెలుసునుగా నేను ఎన్నాళ్ళనుంచి వండు తున్నది!" అని లలిత తల వంచుకున్నది. ఆమె తల నిమురుతూ గురు చరణుడు మనస్సులోనే ఆశీర్వదించాడు. అతని దుశ్చింత ఒకటితొలగింది.

ఈ యిల్లు గల్లీకి కొంచెము ఎత్తుగా ఉన్నది. గురుచరణుడు టీ తాగుతూ కిటికీలోగుండా బయటకు చూసి—"శేఖర్! మాట, మాట!" అని కేక వేశాడు.

ఒడ్డూ పొడుగూ కలిగి బలిష్టంగా ఉన్న సుందర యువకు డొకడు గదిలో ప్రవేశించాడు.

"రా నాయనా కూర్చో! ఇవ్వాళ ఉదయం మీ పిన్ని చేసిన ఘన కార్యం విన్నావన్నట్టుగా ఉందే?"

"ఘనకార్య మేముంది కక్కాయి! కుమార్తెను కన్నది. అదేగా?" అన్నాడు శేఖరుడు మందహాసం చేస్తూ.

"నీకేం? అదేగా అని తోసిపారేస్తావు! కాని'అదేగా'అంటే ఏమిటో నా ఒక్కడికే తెలుసును!" అన్నాడు గురుచరణుడు నిట్టూర్చి.

"అలా అనబోకు కక్కాయి! పిన్నికి తెలిస్తే దుఃఖిస్తుంది. అంతే కాక భగవంతుడు యిచ్చిన తర్వాత వారిని ఆదరించటం, వారితో ఆనందిం చటం ఉచితం."

గురుచరణుడు ఒక్క క్షణకాలం మాట్లాడలేదు.

"ఆదరించడం, ఆనందించడం ఉచితమని నాకూ తెలుసు. కాని

భగవంతుని న్యాయం ఎక్కడున్నది బాబూ? నేను బీదవాణ్ణి గదా! నాకే ఇంతమంది సంతానం ఎందుకు? ఈ యిల్లు ఇదివరకే మీనాన్నకు తాకట్టు పెట్టాను; పెట్టినందుకు నాకేమీ చింతలేదు. ఇదుగో మా లలిత వంక చూడు, శేఖర్! తల్లీ తండ్రీ లేని పుత్తడి బొమ్మ. రాజుల అంతఃపురాలలో రాణించవలసిన మాణిక్యం. ఇలాంటి రత్నాన్ని ప్రాణంవొప్పి వాళ్లా వీళ్ళ చేతుల్లో ఎలా పెట్టమంటావో నీవే చెప్పు. నూరు కోహినూర్లు ఒక రాసి పోసినా మా తల్లి విలువ చేయవు. కాని ఆసంగతి ఎవరు చూస్తారు? డబ్బు చేతిలో లేకపోవటంచేత ఇలాంటి రత్నాన్ని కూడా నేను తుక్కుపోగులో పారవెయ్యవలసి వస్తున్నది! నువ్వే చెప్పు. అలాంటప్పుడు నా హృదయం ఎంత పరితపిస్తుందో! లలితకు ఇప్పుడు పదమూడో ఏడు వచ్చింది సంబంధం కుదర్చాలంటే ఇప్పుడు పదమూడు పైసాలు కూడా లేవు." గురుచరణుని కళ్లల్లో నీరు నిండినది. శేఖరుడు మాట్లాడలేదు.

"ఇదిగో, శేఖర్‌నాథ్! నీ బంధుమిత్రుల్లో ఎవరికన్నా ఈ పిల్లను ఇవ్వటానికి వీలుంటుందేమో చూడు. ఇప్పటి కుర్రవాళ్లు చాలామంది కట్నాలూ కానుకలూ చూడకుండా పిల్లనుచూసి చేసుకుంటారని విన్నాను. దైవానుగ్రహంచేత అలాంటి కుర్రవాడొకడు దొరికితే, శేఖర్‌నాథ్! నా ఆశీర్వాదంచేత నీవు తప్పక రాజవుతావు! నేనింకా ఏమి చెప్పేది బాబూ! ఈ పేటలో నేను మీఆశ్రయంలోనే ఉంటున్నాను. మీనాన్న నన్ను తమ్ముని మాదిరిగా చూసుకుంటాడు."

"సరే, అలాగే చూస్తాను!" అన్నాడు శేఖరుడు.

"మరచిపోకుండా చూడు బాబూ! లలిత ఎనిమిదో యేటనుంచీ నీ దగ్గరే రాతకూతలు నేర్చుకుని మనిషి అయింది. అది ఎలాంటి బుద్ధిమతో, ఎంత ఓర్పు కలదో నీకు బాగా తెలుసును. ఇప్పుడు పనిపాటలు

కూడా చేస్తున్నది. ఇవ్వాళనుంచి మాకు అన్నం వండిపెట్టేది లలితే; ఇప్పుడు యింటి బాధ్యత అంతా దాని నెత్తిమీదనే పడింది!"

ఈ సమయంలో లలిత ఒకమాటు తల ఎత్తి చూచి మరల వంచుకున్నది. ఆమె ఓష్ఠాధరాలు కొంచెం ప్రసారిత మయినవి. గురుచరణుడు ఒక నిట్టూర్పు విడిచి మరల ప్రారంభించాడు.

"వాళ్ళ నాన్న గూడా తక్కువ సంపాదించాడా? కాని చనిపోయేటప్పటికి, ఒక్కగాని ఒక్క కూతురు వుంటే, ఏమీ మిగల్చకుండా దానం చేసి పోయాడు!"

శేఖరుడు మాట్లాడలేదు. గురుచరణుడు తిరిగి మొదలుపెట్టాడు.

"ఏమీ మిగల్చలేదని మాత్రం ఎట్లా చెపుతాను? ఎంతోమంది దీనులకు సహాయపడి, ఆ ఫలితమంతా మా యీతల్లికి ఇచ్చిపోయాడు. అలా కాకపోతే, ఇంత చిన్న పిల్లకే అన్నపూర్ణలాంటి గుణాలు ఎలా అబ్బుతాయి ! నువ్వే చెప్పు, శేఖర్! నిజమంటావా, కాదా?"

శేఖరుడు జవాబివ్వలేదు, నవ్వ నారంభించాడు.

కొంచెముసేపు ఉండి శేఖరుడు పోబోతూ ఉండగా గురుచరణుడు "ఇంత ప్రొద్దున్నే ఎక్కడికి వెళ్ళుతున్నావు?" అని అడిగాడు.

"బారిష్టరుగారింటికి—కేసు ఒకటున్నది" అని అతడు లేచి నిలబడగానే గురుచరణుడు ఇంకోసారి జ్ఞాపకం చేశాడు :

"ఈ మాట కొంచెం మనస్సులో పెట్టుకో బాబూ! కొంచెం నలుపన్నమాటే కాని ఇలాంటి కళ్ళూ, ముఖమూ, నవ్వూ దయాదాక్షిణ్యాలూ— ఈ ప్రపంచమంతా గాలించినా దొరకవు!"

శేఖరుడు తలఊపి నవ్వుతూ వెళ్ళిపోయాడు. ఇతనికి ఇరవై ఐదు ఇరవై ఆరు ఏళ్ళు ఉంటవి. ఎం. ఏ. ప్యాసయి అప్రెంటిస్ చేసి క్రిందటి సంవత్సరమే అటర్నీ అయినాడు. తండ్రిపేరు నవీనరాయ్. ఇతను బెల్లపు

వ్యాపారంతో కొన్ని లక్షలు సంపాదించినాడు. కొంతకాలమునుంచి వ్యాపారము మానివేసి ఇంట్లో కూర్చుని డబ్బును వడ్డీకి తిప్పుతున్నాడు. పెద్ద కుమారుడు అవినాశుడు వకీలు. చిన్నకుమారుడు శేఖరనాధుడు. వారి మూడంతస్తుల మేడ ఈ పేటలో కెల్ల తల ఎత్తుకుని ఉన్నది. వీరి మిద్దే గురుచరణుని మిద్దే కలిసియుండటంచేత ఈ ఉభయ పరివారాలకూ ఆత్మీయత కలిగింది. స్త్రీలు ఈ దోవనే ఒకరింటి కొకరు వస్తూ పోతూ వుంటారు.

౨

శ్యామ బజారులోని ఒక భాగ్యవంతుల కుటుంబంతో చాలా కాలం నుంచి, శేఖరుని పెండ్లి మాటలు జరుగుతున్నవి. ఆనాడు పిల్లతరపువాళ్లు శేఖరుని చూడనికి వచ్చి. వచ్చే మాఘ మాసంలోనే లగ్నం పెట్టుకుందామని అడిగారు, కాని శేఖరుని తల్లి ఒప్పుకోలేదు. కుర్రవాడు స్వయంగా చూచి వచ్చి ఇష్టపడితేనే గాని లగ్నం పెట్టడానికి వీలుకాదని దాసీదానిచేత కబురు పంపింది.

నవీనరాయ్ దృష్టి అంతా డబ్బుమీదనే. భార్య ఇలా అడ్డుపుడక వేసేసరికి అతనికి కొంచెం కష్టము వేసింది. "అదేమి మాట! పిల్ల నిదివరకే చూశాంగా? ముందు సంబంధం స్థిరం కానివ్వు. తర్వాత ప్రధానం పంపేటప్పుడు ఇంకోమారు చూసి రావచ్చును" అని భార్య దగ్గరకు వచ్చి అన్నాడు.

అయినా భార్య సమ్మతించలేదు. గట్టిమాట ఇవ్వనివ్వలేదు. ఆవాళ నవీనబాబు కోపంతో వేళమిగిలి భోంచేసి, పగటి నిద్ర బయట గదిలోనే పోయాడు.

శేఖరనాథుడు కొంచెం సరదా పురుషుడు. మూడవ అంతస్తులో, చక్కగా అలంకరించిన ఒక గదిలో అతను వుంటాడు. నాలు గయిదు రోజులు గడచిన తర్వాత ఒకనాటి మధ్యాహ్నం గదిలో అద్దం ముందు నిలబడి పిల్లను చూచి రావటానికి తయారవుతున్నాడు. ఇంతలో లలిత వెనకగా వచ్చి ఒక క్షణకాలం విశ్శబ్దంగా చూసి "పెళ్ళికుమార్తెను చూడ పోతున్నావులాగుందే," అన్నది.

శేఖరుడు తిరిగి చూచి "నీవా! ఏదీ, నన్ను కాస్త అలంకరించు! —ఎలా అలంకరిస్తావో! పెళ్లికూతురు వదలిపెట్టగూడదు" అన్నాడు.

లలిత నవ్వుతూ "ఇప్పుడు నాకు తీరికలేదు శేఖరదా! డబ్బుకోసం వచ్చాను." అని బాలీసుకిందనుంచి తాళపుచెవులగుత్తి తీసుకుని అలమారా తెరచి కొన్ని రూపాయలు ఎంచి చెరగున కట్టుకొని "డబ్బయితే అవసర మయినప్పుడల్లా తీసుకు వెళ్లుతున్నాను. కాని తీర్చేదెలా" అని గొణుగు కున్నది.

శేఖరుడు దువ్వెనతో ముంగురులు పైకెగదువ్వుతూ లలిత వంక తిరిగి "అదే తీరుతుందిలే" అన్నాడు నవ్వుతూ.

లలితకు అర్థం కాలేదు. చూస్తూ ఊరుకున్నది.

"ఏమిటాలోచిస్తున్నావు, అర్థంకాలేదా?" అని శేఖరుడు అడిగాడు.

"ఉహూ!" అన్నది తల తిప్పుతూ.

"ఇంకా కొంచెం పెద్దదానివవ్వు, అప్పుడు తెలుస్తుంది!" అని శేఖరుడు బూటు తొడుకుని బయటకు వెళ్ళిపోయాడు.

రాత్రి శేఖరుడు ఒక సోఫామీద కళ్లుమూసుకుని పండుకొనిఉండగా తల్లి గదిలోనికి ప్రవేశించినది. శేఖరుడు చివుక్కునలేచి కూర్చున్నాడు. తల్లి పీటమీద కూర్చుని "పిల్ల ఎలా వున్నదిరా?" అని అడిగింది.

శేఖరుని తల్లి పేరు భువనేశ్వరి. ఈమెకు దాదాపు యాభై సంవత్స రాల వయస్సు ఉంటుంది. కాని, కాయపారు శరీరం కావడంచేత చూపు లకు ముప్ఫైయైదు, ముప్ఫైయారు సంవత్సరాలకంటే ఎక్కువ ఉన్నట్టు కనిపించదు. ఈమెకు బాహ్య సౌందర్యముతోపాటు ఆంతరంగిక సౌంద ర్యముకూడా ఉన్నది. ఈమె మాత్ర హృదయం అతికోమలమే కాక అత్యంత నవీనమైనది. ఈమె పల్లెటూరిపిల్ల. అక్కడే పుట్టింది. అక్కడే పెరిగింది. ఐనా పట్టణజీవితం కానీ పట్టణవాసులతో కలసి పోవటం కానీ ఈమెకు ఏమీ కష్టమనిపించలేదు. పట్టణంలో ఉండే చాంచల్యమూ, ఉత్సాహమూ ఆచార వ్యవహారాలూ, ఈమె ఎలా స్వేచ్ఛగా స్వీకరించి నదో, అలాగే జన్మ భూమిలో ఉన్న మాధుర్యమూ, గాఢనిస్తబ్ధతా వదలి పెట్టలేదు. ఈ తల్లినిచూచి శేఖరుడు చాలా గర్వించేవాడు—ఈ సంగతి తల్లికికూడా తెలుసును. పరమేశ్వరుడు శేఖరునికి అనేకము ప్రసాదిం చాడు. అనేకులకు లభించని స్వాస్థ్యము, బుద్ధి—కాని వీటి అన్నిటికంటే, ఇలాంటి తల్లికి సంతానంగా జన్మించటమే గొప్ప అదృష్టమని శేఖరుడు భావించేవాడు.

"బాగా ఉన్నదని ఊరుకున్నావేమిరా?" అని అడిగింది తల్లి.

శేఖరుడు నవ్వుతూ "నువ్వు అడిగిందానికే సమాధానం చెప్పాను" అని తల వంచుకున్నాడు.

తల్లి హాయిగా నవ్వి " చెప్పావు? రంగు ఎలా ఉంటుంది? ఎరుపా? ఎవరిమాదిరిగా ఉంటుంది? మన లలిత మాదిరిగానా?" అని అడిగింది.

"లలిత నల్లనిదమ్మా, దానికంటె ఎరుపు!" అన్నాడు శేఖరుడు తల ఎత్తి.

"ముక్కు మొహం తీరిగ్గా ఉన్నదా?"

"ఫర్వాలేదు."

"అయితే మీ నాన్నకు చెప్పనా?"

ఈ ప్రశ్నకు శేఖరుడు జవాబివ్వలేదు తల్లి ఒక క్షణం పుత్రుని ముఖంవంకచూచి "ఏంరా! పిల్ల ఎంతవరకు చదువుకున్నది." అని హఠాత్తుగా ప్రశ్నించినది.

"ఆసంగతి కనుక్కోలేదమ్మా!"

తల్లికి మహాశ్చర్యం కలిగింది. "కనుక్కోరాకపోవటం ఏమిటిరా. ఈ కాలంలో మీకు ముఖ్యంగా కావల్సిందే ఇదిగా, ఇదే కనుక్కురాలేదా?" అన్నది తల.

"లేదమ్మా! నే నామాటనే మరిచిపోయాను!" అన్నాడు శేఖరుడు.

కుర్రవాని మాటలు విని విస్మయముతో అతనివంక చూసి "ఐతే నీవి పెళ్ళి చేసుకొనేలాగా లేవు." అన్నది నవ్వుతూ.

శేఖరుడు ఏదో చెప్పబోయా, లలిత గదిలోకి రావటంచూసి మాను కున్నాడు. లలిత నెమ్మదిగా భువనేశ్వరి వెనుకకు వచ్చి నిలబడింది. ఆమె ఎడమ చేతితో లలితను తన ముందుకు లాక్కొని "ఏమిటి తల్లీ?" అని అడిగింది.

"ఏమి లేదమ్మా!" అన్నది లలిత మెల్లగా.

లలిత పూర్వం ఈమెను పిన్నీ అని పిలిచేది. 'నేను నీకు పిన్నిని కాను తల్లిని. అమ్మ అని పిలువు' అని శాసించినప్పటినుంచి భువనేశ్వరిని అమ్మా అనే పిలుస్తున్నది. భువనేశ్వరి లలితను దగ్గరకు లాక్కొని బుజ్జగిస్తూ "ఏమీ లేదా, ఐతే నన్నొకమాటు చూచిపోవటానికి వచ్చావా?" అని అడిగింది.

లలిత మాట్లాడలేదు.

"చూట్టానికి వస్తే వంట ఎవ్వరు చేస్తుంది?" అన్నాడు శేఖరుడు.

"వంటచేయటం ఎందుకు?" అన్నది తల్లి.

"వారికి ఎవరు వండిపెడతారమ్మా! మరి వాళ్ళ మామ ఆ నాడు వంట పనులన్నీ లలితే చేస్తున్నదన్నాడే!" అన్నాడు శేఖరుడు ఆశ్చర్యముతో.

తల్లి నవ్వుతూ—"వాళ్ళ మామ నోటికి వచ్చిం దేదో చెప్తుతూ వుంటాడు. పెళ్ళికాని పిల్లల చేతి అన్న మెవరయినా తింటారా? మన వంట బ్రాహ్మణ్ణి పంపాను, అతనే వండిపెడుతున్నాడు. ఇప్పుడు నేను కూడా మధ్యాహ్నం అక్కడే భోంచేస్తున్నాను" అన్నది తల్లి.

తల్లి ఈ దుఃఖితపరివార భారాన్ని కొంత వహించినదని గ్రహించి శేఖరుడు తృప్తిగా నిట్టూర్పు విడిచాడు.

ఒక మాసం గడిచింది. ఒకనాటి సాయంత్రం శేఖరుడు సోఫాలో కూర్చుని ఏదో ఇంగ్లీషు నావెలు తన్మయుడై చదువుతున్నాడు. ఇంతలో లలిత గదిలోకి వచ్చి బాలీసుక్రిందనుంచి తాళపుచెవులు తీసుకొని చప్పుడు చేస్తూ అల్మారీ తెరుస్తున్నది. శేఖరుడు పుస్తకంమీదనుంచి దృష్టి మరల్చకుండానే "ఏమిటి?" అని అడిగాడు.

"డబ్బు తీసుకొంటున్నాను" అన్నది లలిత.

శేఖరు "హుఁ" అని మళ్ళీ చదువ నారంభించాడు. లలిత చెరగున డబ్బుకట్టుకొని దగ్గరకు వచ్చి నిలబడింది. ఇవ్వాళ బాగా అలంకరించుకున్నది. శేఖరుని దృష్టి తనమీద పడాలని ఆమె కోరిక. "పది రూపాయలు తీసుకున్నాను శేఖరదా!" అన్నది.

శేఖరుడు "సరే" నన్నాడు. కాని ఆమె వంక చూడలేదు. అందుచేత ఆమె అటూ ఇటూ తిరుగుతూ అనవసరంగా ఆలస్యంచేయ నారంభిం

చింది. కాని వెంకటేశ్వన్నా లాభమేమీ లేకపోయేపరకు కొంత దూరం వెళ్ళి ఏమో ఆలోచించుకొని మళ్ళీ తిరిగి వచ్చి వాకటివగ్గర నిలబడింది. ఇవ్వాళ థియేటరు చూడటానికి పోతున్నది.

శేఖరుని ఆజ్ఞలేనిది తాను ఎక్కడికీ పోజాలనని ఆమెకు తెలుసును. ఈ సంగతి ఆమెకు ఎవ్వరూ చెప్పలేదు. "ఎందుకు వెళ్ళకూడదూ? వెళ్ళితే ఏమి?" అనే ప్రశ్నలు ఆమె మనస్సులో ఎప్పుడూ ఉదయించలేదు. ప్రాణి మాత్రులకు సహజంగా ఉండే సామాన్య బుద్ధే ఆమెకు నేర్పింది. ఇతరులు తాము తలుచుకున్నది చేయగలరు. తమ ఇష్టంవచ్చిన చోటికి పోగలరు. కాని ఆమె పోజాలదు. ఆమె స్వాధీనంకాదు. ఒక్క అత్త మామల అనుజ్ఞ ఆమె పక్షంలో చాలదు.

"మేము నాటకం చూడటానికి పోతున్నాం!" అని ఆమె తలుపు చాటున ఉండే మెల్లగా అన్నది.

ఈమె మృదుస్వరం శేఖరుని చెవిని పడలేదు. అతనేమీ జవాబివ్వ లేదు. లలిత అప్పుడు యింకా కొంచెం బిగ్గరగా "నాకోసం అందరూ నిలబడి వున్నారు" అన్నది.

ఈ మాట శేఖరునికి వినపడింది. పుస్తకం ఒక పక్కన పెట్టి "ఏమిటి సంగతి?" అని అడిగాడు.

"ఇప్పటికి వినపడిం దన్నమాట! మేము నాటకం చూట్టానికి పోతున్నాం!" అన్నది లలిత కొంచెం అలకతో.

"మేమంటే ఎవరు?"

"నేనూ. అన్నాగారూ. చారుబాలా. దాని తమ్ముడూ, వాళ్ళ మామా-"

"మామ ఎవరు?"

"గిరీన్‌బాబు. అయిదారు రోజులయింది. ముంగేరునుంచి వచ్చాడు. ఇక్కడే బి. ఏ. చదువుతాడు. చాలా మంచి—"

"ఇంతేం! పేరూ, ఊరూ, ఉద్యోగం—సంభాషణ చాలాదూరం వచ్చినట్టుగా ఉందే? అందుకనేనా నాలుగు రోజులనుంచి కనపడటమే లేదు—చీట్లాట బాగా సాగుతున్నదా ఏమా?"

"శేఖరుని ధోరణి చూసేసరికి లలితకు భయం వేసింది. ఇలాంటి ప్రశ్న వస్తుందని ఆమె భావించనే లేదు; జవాబివ్వలేదు.

"ఇన్నాళ్ళనుంచీ పేకాడుతున్నావు కాదూ?"

"చారు చెప్పిందా?" అని లలిత నీళ్ళు నములుతూ అడిగింది.

"చారు చెప్పిందని ఎవరు చెప్పారు?" అని శేఖరుడు ఆమెవంక చూసి "ఒక్కమాటే గుడ్డలవీ వేసుకొని ముస్తాబయి వచ్చావు——సరే, పో!" అన్నాడు.

లలిత కదలలేదు. మాట్లాడకుండా నిలబడింది.

చారుబాల పొరుగుపిల్ల. ఈమె సఖి; సమవయస్క. వారిది బ్రహ్మ సమాజం. శేఖరుడు ఈ గిరీనుని తప్ప అందరినీ ఎరుగును. గిరీన్ అయిదారు సంవత్సరాల క్రిందట మాత్రం ఒకసారి వచ్చిపోయాడు. ఈమధ్య బాంకీపూరులో చదువుతున్నాడు. కలకత్తా రావలసిన అవసరమూ లేదు; రానూ లేదు. అందుచేతనే శేఖరుడు అతన్ని ఎరుగడు.

లలిత అక్కడనుంచి కదలకపోవటం చూచి "ఊరక ఎందుకు నిలబడతావు పోరాదూ?" అని శేఖరుడు ముఖానికి పుస్తకం అడ్డం పెట్టుకున్నాడు.

అయిదారు నిమిషాలు మెదలకుండ ఊరుకుని "వెళ్ళమంటారా?" అని లలిత మెల్లగా అడిగింది.

"పొమ్మని చెప్పానుగా లలితా!"

శేఖరుని ఈ వింత ప్రవర్తన చూసేవరకు లలితకు నాటకం చూడాలనే కోరిక నశించింది. కాని పోకుండా ఉండటానికి కూడా వీల్లేకుండా ఉంది. వాళ్ళందరినీ నాడు ఇంటిదగ్గర నిలబెట్టి వచ్చింది. ఈమె కోసం వారు ఎదురు చూస్తున్నారు. ఆలస్యం అయినకొద్దీ వారి ఉద్విగ్నత హెచ్చిపోతూ ఉండవచ్చునని ఈమె భావించింది. కాని ఏమిచేస్తుంది? అనుమతి తీసుకోకుండా పోయేటంత సాహసం ఈమెకులేదు. ఇంకో రెండు మూడు నిమిషాలు నిశ్శబ్దంగా ఉండి "ఈఒక్కనాటికే! పొమ్మంటారా?" అని అడిగింది.

శేఖరుడు పుస్తకం ఒక ప్రక్కకు పారేసి, కసరినట్టుగా—"నన్ను విసిగించబోకు లలితా; పోవాలనే కోరికవుంటే పో. మంచీ చెడు తెలుసుకునే ప్రాయం నీకు వచ్చింది." అన్నాడు.

లలిత చకితురాలయింది, శేఖరుడు కసరటం కొత్తకాదు. అభ్యాసమే. కాని రెండు సంవత్సరాల ఈ మధ్య ఇలాంటి మాటలు ఈమె వినలేదు. అటు సఖులు ఎదురు చూస్తున్నారు; తాను కూడా గుడ్డలుమార్చి తయారయింది. ఈ మధ్యలో దబ్బుకోసం వచ్చి యీ చిక్కులో పడింది. అప్పుడు వాళ్ళకు ఏమి చెప్పుతుంది? ఎక్కడికయినా పోయే విషయంలో శేఖరుడు నేటివరకూ ఈమెకు పూర్తి స్వాతంత్ర్యం ఇచ్చాడు. ఆ నమ్మకముతోటే గుడ్డలవీ మార్చి తయారయివచ్చింది. ఆ స్వాతంత్ర్యం నేడు ఇలా పోవటమేకాకుండా, పోవటానికి చూపించిన కారణం ఎంత లజ్జాకరమైందో, యిప్పుడు—ఈ పదమూడవ ఏట తెలుసుకుని కుమిలిపోతూవున్నది. అభిమానంతో కళ్ళ నీళ్లు నింపుకొని ఇంకో అయిదారు నిముషాలు అలాగే నిశ్శబ్దంగా నిలబడి కళ్లు తుడుచుకుంటూ వెళ్ళిపోయింది. ఇంటికిపోయి అన్నాకాళిని పిలిపించి దానిచేతిలో పది రూపాయలు పెట్టి

"ఇవ్వాళకు మీరు పోండి కాశీ. నాకు చాలా జబ్బు చేసింది. నేను రాలేనని చారుతో చెప్పు." అన్నది.

"ఏం జబ్బు వదినా?" అని అడిగింది కాశీ.

"తలనొప్పి— ఒళ్ళంతా విరగగొట్టుకు పోతున్నది—అబ్బ!" అని మంచంమీద పండుకుంది. తర్వాత చారువచ్చి బ్రతిమాలింది; బలవంత పెట్టింది; అత్తచేత సిఫార్సుచేయించింది. కాని లలిత ఏమాత్రం ఒప్పుకో లేదు. చేతిలో పదిరూపాయలు పడగానే అన్నాకాళీ ఎప్పుడు పోదామా అని ఉర్రట్లూగుతూ ఉంది. ఈ గోలలో ఒక వేళ ప్రయాణమే ఆగి పోతుందేమోననే భయంతో చారును చాటుకుపిలిచి డబ్బు చూపించి "వదినెకు జబ్బు చేసింది; అదిరాకపోతే ఏం నాయా! నాకు డబ్బిచ్చింది. ఇవిగో మనం వెళ్దాంపద!" అన్నది.

అన్నాకాళీ వయస్సుకు చిన్నదయినా బుద్ధికి పెద్దలను తీసిపోదని చారు గ్రహించి కాళీని వెంటపెట్టుకొని వెళ్ళిపోయినది.

## 3

చారుబాల తల్లి, మనోరమకు ఈ ప్రపంచంలో పేకాటకంటే ప్రియమైన వస్తువ మరొకటి లేదు. ఆమెకు ఆడవలెననే ఆసక్తి ఎక్కువ; కాని దక్షత తరుగు. ఆమెలోని ఈలోటు సవరించటానికి లలిత దొరికింది. లలిత బాగా ఆడగలదు. మనోరమ పినతల్లి కొడుకు గిరీంద్రుడు వచ్చినప్ప టినుంచీ మధ్యాహ్నం వారింట్లో పేకాట సాగుతూనే ఉండేది. గిరీంద్రుడు పురుషుడు, బాగా ఆడగలడు. అందుచేత అతనికి ప్రతిపక్షంలో లలిత ఉండకపోతే ఆట రక్తికట్టేది కాదు.

నాటకానికి వెళ్ళిన మర్నాడు మామూలు వేళకు లలిత రాకపోవడం

చూసి మనోరమ ఆమెకోసం దాసిని పంపింది. అప్పుడు లలిత ఒక ఇంగ్లీషు నవలకు బెంగాలీ తర్జుమా చదువుతూ ఉన్నది-వెళ్ళలేదు. తర్వాత చారు వచ్చి కూడా ఆమెను తీసుకువెళ్ళలేకపోయింది. అప్పుడు మనోరమే స్వయంగా వచ్చి—"లే, నువ్వు పెద్దగా చదివి జడ్జీపని చేయబోవటం లేదు. రా, నీవు పేకాడక తప్పదు" అన్నది.

లలిత చాలా చిక్కులో పడింది. చిన్నమొహం పెట్టి—"ఇవ్వాళ చాలా పని ఉంది. రాలేను. రేపు తప్పక వస్తాను" అన్నది.

మనోరమ ఏమాత్రమూ వినలేదు. వాళ్ళ అత్తయ్యచేత చెప్పించి తీసుకు వెళ్ళింది. ఇవ్వాళ కూడా ఆమె గిరీన్‌కు ప్రతిపక్షిగానే ఆడింది. కాని ఆట రక్తికట్టలేదు. మనస్సంతా ఆటలో లగ్నం చేయలేకపోయింది. ఆడుతున్నంతసేపూ ముళ్ళమీద కూర్చున్నట్టుగా గడిపి వేళ కాగానే బయలుదేరింది.

"రాత్రి మీరు డబ్బు పంపారుగాని రాలేదు. రేపు రండి, మళ్ళీ వెళదాము" అని గిరీంద్రుడు అడిగాడు.

"నాకు నిన్న చాలా జబ్బు చేసింది." అన్నది లలిత మెల్లగా.

"ఇప్పుడు జబ్బు నయమయిందిగా! రేపు రావచ్చును." అన్నాడు గిరీన్ నవ్వుతూ.

"కాదండీ, రేపు నాకు చాలా తొందర పనులున్నాయి" అని లలిత వేగంగా వెళ్ళిపోయింది. ఇవ్వాళ ఆమె శేఖరుని భయం మూలానే మనస్సును ఆటలో లగ్నం చేయలేక పోయింది—అని అనటానికి వీల్లేదు. ఆమె స్వతహాగా సిగ్గుపడింది.

శేఖరుని యింటికి వస్తూపోతూ ఉన్నట్టు ఈ యింటికికూడా లలిత చిన్నప్పటినుంచి వస్తూ పోతూ ఉండేది. వాళ్ళ యింట్లో తిరిగినట్టుగానే

వీళ్ళ యింట్లోనూ అందరి యెదుటా తిరుగుతూ ఉండేది. గిరీన్ యెదుట తిరగటానికిగాని మాట్లాడడానికిగాని మొదట ఈమెకు ఏమీ సంకోచం కలగలేదు. కాని ఇవ్వాళ గిరీన్ దగ్గర కూర్చుని ఆడుతున్నంతసేపూ ఈమె మనస్సు యెలానో ఉన్నది. ఈ కొద్ది రోజుల పరిచయానికే గిరీంద్రుడు తన్ను ప్రేమ దృక్కులతో చూస్తున్నాడని ఈమె గ్రహించింది. పురుషుల ప్రేమ దృష్టి ఇంత లజ్జా కరమయినదని ఈమెకు ఇదివరకు తెలియదు.

లలిత యింటికిపోయి ఒక మాటు కనపడి తొందరగా శేఖరుని గదిలో ప్రవేశించి పనిలో నిమగ్నమైంది. చిన్నప్పటినుంచీ చిన్నా పెద్దా అనే తేడా లేకుండా—ఈ గదిలో పనులన్నీ ఈమె చేస్తూ ఉండేది. పుస్తకాలు సర్దడం, టేబిలు తుడవడం, కలం — సిరాబుడ్డీ వగయిరాలు తుడిచి శుభ్రం చేయటం—అన్నీ ఈమె వంతు. ఇంకెవ్వరూ ముట్టుకునే వారు కారు. ఈ అయిదారు రోజుల పాలుమాలిక మూలాన చాలా పనులు పేరు కొన్నవి. ఈ లోట్లన్నీ శేఖరుడు రాక పూర్వమే సవరించాలని ఈమె నడుము కట్టుకొన్నది.

లలిత భువనేశ్వరిని 'అమ్మా' అని పిలుస్తుంది. తీరుబడి ఉన్నపుడల్లా ఆమె దగ్గరనే ఉంటుంది. లలిత ఈ యింట్లోవారి నెవ్వరిని పరాయి వారని అనుకునేదికాదు. అందుచేత ఈ—ఇంట్లో వారెవ్వరూ కూడా ఈమె పరాయిదని భావించేవారుకారు. ఎనిమిదో యేట తల్లిదండ్రులు చనిపోయి మామగారింటికి వచ్చింది. అప్పటినుంచీ శేఖరుని వెంట చెల్లెలు మాదిరిగా తిరుగుతూ, చదువూ అదీ నేర్చుకున్నది.

ఈమె శేఖరునికి ప్రేమ పాత్రి అని అందరకూ తెలుసును. కాని ఆ ప్రేమ ఇప్పుడు ఏ రూపం ధరించినదో ఎవ్వరికీ తెలియదు — లలితకూ

తెలియదు. శేఖరుడు ఈమెను చిన్నప్పటినుంచీ ఒకే భావంతో మహా అదరం చూపిస్తూ వస్తున్నాడు. ఈ ఆదరం ఇప్పటివరకు ఎవ్వరికీ విస దృశంగా కనుపించలేదు. లేక ఈ ఆదరం ఎవ్వరి దృష్టినీ ఆకర్షించలేదని కూడా చెప్పవచ్చును. ఒకప్పుడు ఈమె వధువుగా ఈ గృహంలో ప్రవే శిస్తుందని ఎవ్వరూ భావించలేదు. ఎవరిదాకా ఎందుకు?—లలిత అత్తమామలే అనుకోలేదు; ఆఖరికి భువనేశ్వరికూడా తలచలేదు.

పని తొందరగా పూర్తిచేసి శేఖరుడు రాక పూర్వమే వెళ్లాలని లలిత అనుకొన్నది. కాని అన్యమనస్కగా ఉండటంచేత గడియారం వంక చూడనేలేదు. హఠాత్తుగా గదిబయట బూట్ల చప్పుడు విని తల ఎత్తి చూచి ఒక ప్రక్కకుపోయి నిలబడింది. శేఖరుడు గదిలోనికి రాగానే—"నీవా! నిన్న యింటికి చేరుకునేసరికి ఎన్ని గంటలయింది?" అని అడిగాడు.

లలిత జవాబివ్వలేదు.

శేఖరుడు సోఫాలో పండుకొని "ఎప్పుడు తిరిగివచ్చావు? రెండిం టికా, మూడింటికా? నోట మాటలేదే!" అన్నాడు.

లలిత అలానే మాట్లాడకుండా నిలబడింది.

"క్రిందకుపో, అమ్మ పిలుస్తున్నది."అన్నాడు శేఖరుడు విసుకుపుట్టి.

భువనేశ్వరి భండార గృహంలో కూర్చుని పళ్లెంలో ఫలహారాలు పెట్టుతూ ఉండగా లలిత దగ్గరకువచ్చి "అమ్మా నన్ను పిల్చావా?" అని అడిగింది.

"ఎక్కడా? పిలువలేదే!" అని ఆమె తలఎత్తి లలిత ముఖంవంక చూసి "ముఖం అలా వాడిపోయిందేం లలితా! ఇంకా భోంచేయలేదా" అని అడిగింది.

లలిత లేదన్నట్టు తల తిప్పింది.

"సరే పో, మీ అన్నకు ఈ ఫలహారాలు దబ్బున ఇచ్చిరా!" అని అన్నది భువనేశ్వరి.

లలిత ఫలహారాల పళ్లెం చేత పట్టుకొని పైకి వచ్చింది. శేఖరుడు ఇంకా సోఫాలో కళ్లు మూసుకొని పండుకునే వున్నాడు; ఆఫీసు దుస్తులు విడువలేదు. చేతులూ ముఖమూ కడుక్కోలేదు. లలిత దగ్గరకు వచ్చి "ఫలహారం తెచ్చాను" అన్నది మెల్లిగా.

"అక్కడ పెట్టి పో!" అన్నాడు శేఖరుడు కళ్లు తెరవకుండానే.

లలిత క్రింద పెట్టలేదు. చేత పట్టుకొని అలానే నిలబడింది.

శేఖరుడు కళ్లు తెరవకపోయినా లలిత అక్కడనుండి పోలేదని గ్రహించాడు. రెండు నిముషాలయిన తర్వాత "ఇంకా ఎంతసేపు నిలబడతావు లలితా! నాకు ఇంకా ఆలశ్యం ఉంది; బల్ల మీద పెట్టి క్రిందకు పో" అన్నాడు.

లలితకూ విసుగ్గానే ఉంది. "ఆలశ్యం అయితేమానె. నాకు క్రింద పనేమీ లేదు" అన్నది మెల్లగా.

శేఖరుడు కళ్లు తెరచి నవ్వుతూ "అదిగో మాట వచ్చిందే! క్రింద పనిలేకపోయినా ఆ యింట్లో పని వున్నదిగా? అక్కడా లేకపోతే అవతల యింట్లోనైనా వుంటుంది! నీకు ఒక యిల్లు కాదుగా లలితా?" అన్నాడు.

"లేక" అని కోపంతో లలిత ఫలహారాల పళ్లెం టప్పున బల్లమీద ఉంచి చక చకా వెళ్ళిపోయింది.

"సాయంకాలం ఒకమాటు రా!" అని శేఖరుడు కేక వేశాడు.

"ఒక వందసార్లు నేను పైకీ కిందకీ తిరగలేను!" అని లలిత క్రిందకు వెళ్ళింది.

"అన్నాయికి ఫలహారం యిచ్చి వచ్చావు కాని తాంబూలం యిచ్చి రాలేదేమే?" అన్నది తల్లి, లలిత క్రిందకు రాగానే.

"నాకు ఆకలి అవుతున్నదమ్మా! నేనిక పోలేను. ఇంకెవరినైనా పంపు" అని టప్పున కూలబడింది.

ధుమధుమలాడే లలిత ముఖంవంక చూసి, భువనేశ్వరి మందహాసం చేస్తూ—"సరే! నువ్వు తిందువుగాని కూర్చో. నేను దాసీచేత పంపు తాను" అన్నది.

లలిత జవాబివ్వకుండా తిన నారంభించినది.

తాను థియేటరుకు పోలేదు—పోకపోయినా శేఖరుడు తన్నెందుకు మందలించాలి!—ఈ కోపంతో లలిత నాలుగైదు రోజులు శేఖరునికి కని పించలేదు. కాని అతను ఆఫీసుకు వెళ్ళగానే గదిలో పనంతా చేస్తూ వుండేది. శేఖరుడు తన పొరపాటును గుర్తించి రెండు మూడు సార్లు పిలిచాడు. కాని లలిత రాలేదు.

## ౪

ఈ పేటకు ఒక వృద్ధుడు అప్పుడప్పుడు బిచ్చానికి వస్తూ ఉండే వాడు. అతని మీద లలితకు చాలా దయ. వచ్చినప్పుడెల్లా ఒక్కొక్క రూపాయి ఇస్తూఉండేది. రూపాయి చేతిలో పడగానే వాడు అసంభవమూ అపూర్వమూ అయిన ఆశీర్వాదాలన్నీ యిస్తూ వుండేవాడు: లలిత పూర్వ జన్మలో వాడి తల్లి అట; ఈ సంగతి వాడు లలితను చూడగానే గుర్తిం చాడట!—ఇలాంటివి వినటం లలితకు చాలాఇష్టం. ఇవ్వాళ, లలిత వృద్ధ సంతానం ఉదయాన్నే వచ్చి "మా తల్లి ఏదీ!" అని పిలిచాడు.

సంతానం పిలుపు విని లలిత కొంచెం వ్యాకులపాటు చెందినది.

శేఖరుడు ఇంకా ఆఫీసుకు వెళ్ళలేదు. డబ్బు ఎలా తీసుకువస్తుంది? కొంచెం సేపాలోచించి అత్త దగ్గరకు పోయింది. అత్త అప్పుడే పనిచేసేదానితో పోట్లాడి ముఖం మాడ్చుకొని పొయ్యిదగ్గర కూర్చుని ఉన్నది. ఆమెను అడగటానికి ధైర్యం చాలక తిరిగి వాకిట్లో కొచ్చింది. బిచ్చగాడు కర్ర గోడకు ఆనించి గడప దగ్గర కూర్చున్నాడు. లలిత అతని కెప్పుడూ నిరాశ కలిగించలేదు. ఇవ్వాళ ఉత్త చేతులతో ఎలా పొమ్మంటుంది?

బిచ్చగాడు మరల పిలిచాడు.

"ఒదినే! మీ అబ్బాయి వచ్చాడు' అన్నది అన్నాకాళి పరుగెత్తు కుంటూ వచ్చి.

"కాళీ! ఒకపని చేసిపెట్టమ్మా. నీకు నమస్కారం చేస్తాను. శేఖర బాబు దగ్గరకు పోయి త్వరగా ఒక రూపాయి తెచ్చిపెట్టు.'

కాళి పరుగెత్తుకుంటూ పోయింది. కొంచెం సేపట్లోనే రొప్పుకుంటూ వచ్చి రూపాయి చేతిలో పెట్టి "ఇదిగో తీసుకో' అన్నది.

"శేఖరదా ఏమన్నాడే?'

"ఏమీ అనలేదు. చొక్కా జేబులో వుంది. తీసుకు పొమ్మన్నాడు. నేనే తీసుకు వచ్చాను.'

"ఇంకేమీ అనలేదా?"

"ఉహు! ఇంకేమీ అనలేదు." అని, కాళి ఆడుకోడానికి తుర్రున పారిపోయింది.

లలిత బిచ్చగాణ్ణి పంపించింది. కాని ఇతర దినాలు మాదిరిగా అతని పొగడ్త వినలేక పోయింది. అసలు బాగా కూడా వుండలేదు.

కొన్నాళ్ళనుంచి మధ్యాహ్నం చీట్లపేక బాగా సాగుతూ ఉన్నది. ఇవ్వాళ మధ్యాహ్నం లలిత వెళ్ళలేదు. తలనొప్పిగా ఉన్నదని పండు

కున్నది. ఇ వ్వాళ నిజంగా ఆమె మనస్సేమీ బాగులేదు. సాయంకాలం కాళిని దగ్గరకు పిలిచి 'కాళీ నువ్వు శేఖరదా దగ్గరకు పోవటంలేదా పాఠం వప్పగించటానికి?' అని అడిగింది.

'ఆఁ పోతున్నానుగా' అన్నది కాళి.

'శేఖరదా నా సంగతి ఏమీ అడగటంలేదా?'

'ఉహూఁ! ఆఁ! ఆఁ! మొన్న అడిగాడు. నువ్వు మధ్యాహ్నం పూట చీట్లాడుతున్నావా లేదా? అని."

'నువ్వేమన్నావు?' అని లలిత అదుర్దాతో అడిగింది.

'నువ్వు మధ్యాహ్నంపూట చారుదీదీ యింటికి చీట్లాడటానికి పోతు న్నావుగా! అదే చెప్పాను. 'ఎవరెవరు ఆడతారని' శేఖరదా అడిగాడు. నువ్వూ, చారు తల్లీ, చారూ, చారు మామా ఆడతారని చెప్పాను. సరేగాని పదినా! నువ్వు బాగా ఆడతావా, చారు మామయ్య బాగా ఆడతాడా? నువ్వే బాగా ఆడతావంటుందే—చారు తల్లీ?'

లలిత ఈ మాటకు జవాబివ్వకుండా విరక్తితో— 'నువ్వు యీ మాటలన్నీ ఎందుకు చెప్పబోయావు? అన్నిటికీ నేనేనని బయలుదేరుతావు —పో, ఇక నీకు ఏమీ ఇవ్వను!' అని కోపంతో వెళ్ళిపోయింది.

కాళి కొయ్యబారింది. లలిత ఆకస్మికంగా యిలా మారిపోవడానికి కారణం యేమిటో ఆ పిల్లకు అర్థం కాలేదు.

రెండు రోజులనుంచి మనోరమ ఇంటివద్ద చీట్లాట ఆగిపోయింది. లలిత రావటంలేదు. లలితను చూచినప్పటినుంచి గిరీంద్రుడు ఆమె యెడ ఆకర్షితుడయ్యాడని మనోరమ మొదటనే సందేహించింది. ఆ సందేహం ఇవ్వాళ రూఢి అయింది.

ఈ రెండు రోజులనుంచి గిరీంద్రుడు ఏదో ఒక రకం ఉత్సుకత తోనూ అన్యమనస్కంగానూ ఉండ నారంభించాడు. సాయంత్రం షికారు పోవటంలేదు వేళా పాళా లేకుండా లోపలికివచ్చి గదులన్నీ వెతుకుతూ ఉండేవాడు. ఇవ్వాళ మధ్యాహ్నం మనోరమ దగ్గరకువచ్చి 'అక్కయ్యా ఇవ్వాళకూడా ఆట ఉండదా' అని అడిగాడు.

'ఎట్లా ఉంటుంది గిరీన్! చేతులేవీ?—లేకపోతే మనం ముగ్గురం ఆడుకుందాముర్రా!'

గిరీన్ నిరుత్సాహంతో—'ముగ్గురం యెలా ఆడుతా మక్కయ్యా? లలితను ఒకమాటు పిలిపించ కూడదూ?' అని అడిగాడు.

'ఆమె రాదు.'

'ఎందుకురాదు? వాళ్ళ వాళ్ళు వద్దన్నారా?'

'లేదు. వాళ్ళత్తమామలు అలాంటి మనుష్యులు కారు — ఆ పిల్లే రావటంలేదు.'

గిరీన్ సంతోషంతో—'వాళ్ళు వద్దనలేదుగా! అయితే నువ్వొక మాటు పోయిరా! వచ్చేస్తుంది!' అని తానన్నమాటకు మనసులో చాలా సిగ్గు పడ్డాడు.

'సరే! వెళ్ళి వస్తాను!' అని మనోరమ వెళ్ళింది. కొంచెం సేపట్లోనే లలితను లాక్కువచ్చి చీట్లపేక దగ్గర కూర్చోబెట్టింది.

రెండు రోజులనుంచీ ఆట లేదు. ఇవ్వాళ కాసేపట్లోనే ఆట రక్తి కట్టింది. లలిత పక్షం గెలుస్తూ వున్నది. ఒక గంటా రెండు గంటలు గడిచినాక కాళి పరుగెత్తుకుంటూ వచ్చి 'ఒదినా! శేఖరదా పిలుస్తున్నాడు. ఊఁ జల్దీ!' అన్నది.

లలిత ముఖం వెలవెలపోయింది. తెరచిన పేకముక్కలు చేతిలో బిగించి 'శేఖరదా ఆఫీసుకు వెళ్ళలేదా?' అని అడిగింది.

'నాకేం తెల్సు. ఎందుకో వచ్చేశాడు!' అని తల తిప్పుతూ కాళీ వెళ్లిపోయింది.

ముక్కలు క్రింద పెట్టి మనోరమ ముఖంవంక చూస్తూ లలిత కుంఠితభావంతో 'పోతాను పిన్నీ?' అని అన్నది.

'అదెలాగే, ఈ చుట్టు తిరగనివ్వు' అన్నది మనోరమ లలిత చేయి పట్టుకుని.

చేయి విడిపించుకుని లలిత వ్యాకులపాటుతో లేచి నిలబడి "కాదు పిన్నీ, వారికి చాలా కోపం వస్తుంది" అని తొందరగా వెళ్ళిపోయింది.

"ఈ శేఖరదా ఎక్కడనుంచి వచ్చాడు అక్కయ్యా?" అని అడిగాడు గిరీన్.

"అదిగో. ఆ ఎదురుగా పెద్దమేడ కనపడటంలేదూ? వాళ్ళబ్బాయి" అన్నది మనోరమ.

"ఓ ఆ ఇల్లా! నవీనబాబు వీళ్ళకు దగ్గరవాడు కాదూ?"

మనోరమ ఒక మాటు కుమార్తె వంక చూసి మందహాసంచేస్తూ "చాలా దగ్గరవాడు! అందుచేతనే వాళ్ళఇల్లు కాస్తా కలుపుకోవాలని కాచుకు కూర్చున్నాడు" అన్నది.

గిరీన్ ఆశ్చర్యంతో చూస్తూ ఊరుకున్నాడు.

అప్పుడు మనోరమ, గత సంవత్సరం ధనాభావంచేత గురుచరణ బాబు రెండవ కుమార్తె పెళ్లి ఎలా ఆగిపోయిందీ, తర్వాత ఇల్లు తాకట్టు పెట్టి నవీనరాయ్ దగ్గర పెద్ద వడ్డీకి డబ్బు ఎలా తీసుకున్నదీ, మహా రస వత్తరంగా వర్ణించి—"ఈ అప్పు ఏవిధంగాను తీరదు; చివరకు ఈఇల్లు

నవీనరాయే కలుపుకుని పాత దాబా పడగొట్టి చిన్నకొడుకు శేఖరుని కోసం పెద్ద మేడ వేస్తాడు. ఇద్దరి కొడుకులకు వేరే వేరే ఇళ్ళు! ఉద్దేశ్యము మంచిదే!" అని సొంత అభిప్రాయాన్ని చెప్పింది.

ఈ ఇతిహాసం గిరీనుకు దుఃఖం కలిగించింది— "సరే అక్కయ్యా! గురుచరణబాబుకు ఇంకా ఆడపిల్లలున్నారుకదా — వాళ్ళ పెళ్ళిళ్ళు ఎలా చేస్తాడు?" అని అడిగాడు.

"తన పిల్లలే కాదు పైగా లలిత కూడా ఉంది. ఆ పిల్లకు తల్లి తండ్రులు లేరు. ఆమె భారం అంతా ఈ బీదవాళ్ళమీదనే పడ్డది. ఈడు వచ్చిన పిల్ల. ఈ సంవత్సరములో పెళ్ళిచేయక తప్పదు. వాళ్ళ సమాజములో సహాయం చేసేవాళ్లెవరూ లేకపోయినా పెలి వేయడానికి అందరూ సిద్ధమవుతారు. మన పని సుఖంకాదూ! గిరీన్?" అని అడిగింది.

గిరీన్ జవాబివ్వలేదు. ఆమె మరల చెప్ప నారంభించింది.

"ఆవాళ లలితసంగతి వచ్చి వాళ్ళ అత్త నాదగ్గర ఘోరునఏడ్చింది. పెళ్ళి ఎలా చెయ్యాలో వాళ్ళ కేమీ తోచటం లేదు. ఈ దిగులుతో గురుచరణబాబు నిద్రాహారాలు మానేశాడు—ఆఁ గిరీన్! ముంగేరులో నీకు చాలా మంది మిత్రులున్నారు కదా—వాళ్ళలో పిల్లను చూచి చేసుకునేవారెవరూ లేరా? ఇలాంటి పిల్ల దొరకటం చాలా కష్టం."

గిరీన్ విషణ్ణభావముతో చిన్న నవ్వు నవ్వి— "స్నేహితు లెవరున్నారు అక్కయ్యా!— కాని నేను డబ్బు సహాయమైతే మాత్రం చేయగలను" అన్నాడు.

గిరీన్ తండ్రి డాక్టరీ చేసి చాలా ధనమూ, స్థిరాస్తులూ కూడబెట్టి పోయాడు. ఇప్పుడు వాటికి ఇత నొక్కడే వారసుడు.

"పైకం నువ్వు అప్పుగా ఇస్తావా?"

"ఇంకా అప్పేమిటి, అక్కయ్యా! తీర్చగలిగితే తీరుస్తారు. లేక పోతే లేదు."

మనోరమ విస్మయంతో "దబ్బిస్తే నీకు లాభం? వాళ్ళు నీకు దగ్గిర వాళ్లు కారాయె, ఆఖరకు సమాజీయులైనా కాదాయె. ఇలా యెవరన్నా ఇతర్లకు దబ్బిస్తారా?" అని అడిగింది.

గిరీన్ మనోరమ ముఖ భంగిమ చూసి నవ్వుతూ "సమాజీయులు కాకపోయినా బెంగాలీలేగా? వారికి ధనాభావంగా ఉన్నది. నాకు ధనము విస్తారంగా ఉన్నది. ఒకమాటు అడిగి చూడు అక్కయ్యా! వాళ్లు వొప్పు కుంటారేమో? నేనిస్తాను. లలిత వాళ్ళకూ ఏమీకాదు, మనకూ ఏమీకాదు. ఆ పిల్ల పెళ్ళి కర్చులన్నీ నేనే భరిస్తాను" అన్నాడు.

అతని మాటలు మనోరమకు అంతగా సంతుష్టి కలిగించలేదు. నిజంగా ఆమెకు యిందులో వచ్చేదీ పోయేదీ ఏమీలేదు. చాలామంది స్త్రీలు ఇంతదబ్బు ఒకరికి ఒకరు ఉచితంగా ఇస్తుండడం చూసి సంతోషించలేరు. అందులో ఈమె ఒకతె.

చారు ఇంతవరకు ఏమీ మాట్లాడకుండా వింటూ ఉన్నది. ఇప్పుడు సంతోషముతో ఒక్క గంతు వేసి "అలాగే ఇవ్వు మామా! నేను వాళ్ళ అత్తకు చెప్పి వస్తాను" అన్నది.

చారును బెదిరిస్తు "నువ్వూరుకో చారూ, చిన్నపిల్లవి. ఇలాంటి విషయాల్లో జోక్యం చేసుకోబోకు. చెప్పాల్సి వుంటే నేనే చెప్పుతాను." అన్నది మనోరమ.

"అలాగే చెప్పు అక్కయ్యా! మొన్న రోడ్డుమీదనే కాసేపు గురు చరణబాబుతో మాట్లాడాను, మాటలను బట్టి చూస్తే చాలా మంచివాడుగా కనబడ్డాడు. నువ్వేమంటావు?" అన్నాడుగిరీను

"నేనూ అంతే అంటాను. నే నేమిటి? అందరూ అదే అంటారు. వాళ్ళ భార్యా భర్తలు చాలా అమాయకులు. అలాంటివారు ఆఖరికి ఇల్లూ వాకిలి లేకుండా పోతారేమోనని నాకు చింతగా వున్నది. దానికి దృష్టాంతరము చూడు, గిరీన్. శేఖరుడు పిలిచాడనగానే లలిత ఎలా గాభరా పడుతూ పరిగెత్తిందో? గురుచరణబాబు కుటుంబమంతా వారికి అమ్ముడు పోయినట్టుగా వుంటారు. కాని వీరెంత వినయము చూపినా ముఖస్తుతి చేసినా ఒక మాటు నవీనరాయ్ చేతిలో చిక్కినాక తప్పించుకు బయట పడటం అసంభవం!"

"అలా అయితే తప్పకుండా చెప్పుతావా, అక్కయ్యా"

"అలాగే అడిగిచూస్తాను" అని మందహాసం చేసి "సరేగాని నీకు దీనిలో ఇంత శ్రద్ధ ఎందుకు గిరీన్?" అని అడిగింది.

"శ్రద్ధేముంది అక్కయ్యా! కష్టనష్టాలలో ఒకరికొకరు సహాయం పడవద్దూ," అని కొంచెం సిగ్గుపడుతూ వాకిటివాకా వెళ్ళి మళ్ళీ తిరిగి వచ్చి కూర్చున్నాడు.

"మళ్ళీవచ్చి కూర్చున్నావే!"అన్నది మనోరమ.

"నువ్వు చెప్పిందంతా నిజం కాదనుకుంటున్నాను, అక్కయ్యా!" అన్నాడు గిరీనుడు.

"ఎందుకని?"అన్నది మనోరమ విస్మయముతో.

"వాళ్ళ లలిత డబ్బు ఖర్చుపెట్టే వాలకం చూస్తే వాళ్లు దరిద్రులని ఎంత మాత్రం అనుకోటానికి వీల్లేదు అక్కయ్యా! మేము నాటకం చూట్టానికి పోయిన రోజున తాను రాకపోయినా కాళికి పదిరూపాయలిచ్చి పంపింది చారు నడుగు. ఎలా ఖర్చు పెడుతుందో? కనీసం నెలకు యిరవై రూపాయలన్నా లేనిదే ఆ పిల్లకు జరగదు."

"నిజం అమ్మా! అదంతా శేఖరబాబు డబ్బు. ఇప్పుడేకాదు. చిన్నప్పటినుంచీ శేఖరబాబు అల్మారీ తెరచి డబ్బు తెస్తూ ఉండేది. ఎవ్వరూ ఏమీ అనరు." అన్నది చారు చేయి ఆడిసూ.

మనోరమ కుమార్తెవంక సందిగ్ధభావంతో చూచి—"డబ్బు తీసుకు వెడుతుందని శేఖరబాబుకు తెలుసునా?" అని అడిగింది.

"తెలుసును. ఎదుటనే తాళంతీసి తీసుకొస్తుంది. కిందటి నెల్లో అన్నాకాళీ బొమ్మల పెళ్ళికి అంత డబ్బు ఎవరిచ్చారు? అంతా లలితేనమ్మా"

మనోరమ కొంచెంసేపు ఆలోచించి—"ఎవరికి తెలుసును? కాని కొడుకు మాత్రం తండ్రంత పీనాసివాడుకాదు. తల్లి పోలిక—అందుకనే కాస్త దయా ధర్మాలున్నాయి. అదీకాక లలిత చాలా బుద్ధిమంతురాలు. చిన్నప్పటినుంచీ లలిత అతని దగ్గర ఉండేది. అన్నా అని పిలిచేది. అందుకని ఆమెను అంతా ప్రేమించేవారు. -ఆఁ చారూ! నువ్వు వాళ్ళింటికి పోతూ ఉంటావు కదా. ఈ మాఘమాసంలో శేఖరుడి పెళ్ళట నిజమేనా? ముసలాడు ఈ పెళ్ళికి చాలా డబ్బు పడుక్కుంటున్నాడని విన్నాను!" అని అన్నది.

"ఔనమ్మా! ఈ మాఘ మాసంలోనే—అంతా స్థిరపడింది." అన్నది చారు.

౨

గురుచరణుడు చిన్నల్లో చిన్నగానూ పెద్దల్లో పెద్దగా కలిసిపోయే స్వభావం కలవాడు. రెండు రోజుల పరిచయానికే వీరికీ గిరీన్‌కూ బాగా స్నేహం కుదిరింది. గురుచరణుని మనస్సు అంత దృఢమైంది కాదు.

వీరికి తర్కించటం చాలా ఇష్టం. కాని తర్కంలో ఓడిపోయినప్పటికీ అసంతుష్టి చెందేవాడు కాడు.

రోజూ సాయంత్రం 'టీ'కి రమ్మని గిరీన్ను ఇదివరకే. ఆహ్వానించాడు. గురుచరణుడు ఆఫీసునుంచి వచ్చేసరికి ప్రొద్దు క్రుంకుతూండేది. కాళ్ళూ చేతులూ కడుక్కొని లలితా! 'టీ' తయారయిందా తల్లీ! క్షాళీ, పోఫో! త్వరగా పోయి మీ గిరీన్ మామను పిలుచుకురా. అంటూ ఉండేవాడు. తర్వాత ఇద్దరూ కూర్చుని టీ త్రాగటం, తర్కించటం జరుగుతూ ఉండేది.

లలిత ఒక్కొక్కనాడు మామ చాటున కూర్చుని మాట్లాడకుండా వింటూ ఉండేది. ఇక ఆనాడు గిరీనుకు ఎన్నడూలేని తర్కశక్తి కలిగేది. తరచుగా తర్కం ఆధునిక సమాజానికి ప్రతికూలంగా జరుగుతూ ఉండేది. సామాజిక అత్యాచారం,హృదయహీనత్వం, అసంగత ఉపద్రవాలు మొదలగు సత్యవిషయాలమీదనే చర్చ నడిచేది.

అసలు వీటిని సమర్థించటానికి తగిన యదార్థప్రమాణాలేవీ లేవు. అందుచేత గురుచరణుని ఉత్పీడిత అశాంత హృదయం గిరీన్ మాటలతో ఏకీభవించిపోయేది.

"నిజమే గిరీన్! ఒకరు చెప్పారని కాకపోయినా ఎవరి బిడ్డలకు వాళ్ల యుక్తవయస్సు రాగానే పెళ్ళి చేయాలిసిందే. కాని చేసేదెలా? పిల్లకు యీడు వొచ్చింది. పెళ్ళి చేసివేయమంటుంది సమాజం; కాని చేసే బందోబస్తేమీ చేయదు! చూడు, గిరీన్! నాసంగతే తీసుకుందాము, ఉన్న యిల్లు కాస్తా తాకట్టు పెట్టాను. రెండు రోజులుంటే పిల్లలను వెంటబెట్టుకొని రోడ్డుమీదకు పోయి నిలబడాలి. అప్పుడు సమాజం 'రండి మా యింట్లో వుందురు గాని' అని అనదు. ఏమంటావు?" అని ఆఖరుకు అడిగేవాడు.

గిరీన్ ఏమీ జవాబిచ్చేవాడు కాడు. గురుచరణుడు మరల ప్రాకం ఖించేవాడు.

"నేను చెప్పేదే యదార్థం. ఇలాంటి సమాజంలో ఉండే కంటే జాతిని వదలుకోవటం మంచిది. కడుపులోనికి లేకపోయినా శాంతిగానైనా ఉండవచ్చును. దుఃఖితుల దుఃఖం అర్థంచేసుకోలేని సమాజం, అర్థం చేసుకోపోవటం అలా ఉంచి పైగా గుడ్లుఉరిమి గొంతునొక్కే సమాజం, నాదికాదు, నా బోటి బీదవారిదికాదు, ఈ సమాజం భాగ్యవంతులది; సరే, వారికే ఉండనివ్వు, మాకు అక్కర్లేదు" అని గురుచరణుడు చప్పున ఆగి పోయేవాడు.

ఈ ఖండన మండనాలు లలిత మనస్సు లగ్నంచేసి వినటమే కాకుండా రాత్రిళ్లు ప్రక్కమీద పండుకొని నిద్ర వచ్చేటంతవరకు ఆలో చించి చూసేది. ప్రతిమాటా ఆమెమనస్సులో గంభీరంగా నాటుకుపోయేది. నిజానికి గిరీన్‌బాబు చెప్పిన మాటలన్నీ చాలా న్యాయ సంగతమైనవని మనస్సులో అనుకోనేది.

లలితకు మామమీద చాలా ప్రేమ. మామను గిరీనుడు తన వైపుకు లాక్కున్నాడు. అందుచేత గిరీనుడు చెప్పిందల్లా పదహారణాలూ సత్య మని ఆమె అనుకొనేది. మామ తనకోసం చాలా వ్యాకుల పడుతున్నాడు. నిద్రాహారాలు వదిలాడు. దుఃఖితుడూ నిర్విరోధీ అగు మామ తనకు ఆశ్ర యము ఇవ్వటంచేతనే ఇంత క్లేశం అనుభవిస్తున్నాడు. మామకు జాతి పోతుందట; ఎందుకు? ఇవ్వాళ నా పెళ్ళిచేస్తే, రేపు నేను విధవనై యింట్లో వుండిపోయినా, జాతిపోదు. ఇందులో అందులో భేదమేమున్నది? గిరీన్ మాటల్లోని ప్రతిధ్వనిని తన భావాతుర హృదయంలోనుంచి ఇంకో మాటు బయలుదేరతీసి మరోమాటు విమర్శిస్తూ లలిత నిద్రపోయేది.

తన మామ దుఃఖం గ్రహించి సానుభూతిగా మాట్లాడినవారితో ఏకీభవించ కుండానూ శ్రద్ధ చూపించకుండానూ లలిత వుండలేక పోయేది. ఆమె గిరీంద్రునికి అంతరంగిక భక్తి జూపించ నారంభించింది. క్రమంగా గురు చరణుని మాదిరిగా ఆమెకూడా సాయంకాలం 'టీ' వేళ ఎప్పుడవుతుందా అని జూస్తూ ఉండేది.

పూర్వం గిరీనుడు లలితను 'మీరు' అని సంబోధించేవాడు. కావి గురుచరణుడు వారించి "మీరు అని పిలుస్తావెందుకు? గిరీన్, నీవు అని పిలువు" అన్నాడు. అప్పటినుంచి గిరీనుడు లలితను 'నీవు' అని పిలువ నారంభించాడు.

"నువ్వు టీ త్రాగావా లలితా?" అని ఒకరోజున గిరీనుడు అడిగాడు.

లలిత తలవంచుకొని త్రాగనన్నట్లు తల తిప్పింది.

"వాళ్ళ శేఖరదా వద్దన్నాడు. స్త్రీలు, టీ త్రాగటం అతనికిష్టంలేదు." అని గురుచరణుడు చెప్పాడు. ఈ కారణం గిరీంద్రునికి అంత తృప్తి కరంగా లేదని లలిత గ్రహించింది. ఇవ్వాళ శనివారము. ఇతర దినాల కంటే యివ్వాళ సభ ఇంకా కొంచెం ఎక్కువసేపు ఉంటుంది.

టీ త్రాగటం పూర్తి అయింది. గురుచరణుడు ఇవ్వాళ సంభాషణలో అంత ఉత్సాహంగా పాల్గొనటంలేదు. మధ్య మధ్య అన్యమనస్కంగా ఉంటున్నాడు. గిరీనుడు ఇది సులువుగా గ్రహించి "ఇవ్వాళ మీ ఒంట్లో బాగాలేదనుకుంటాను." అని అన్నాడు.

గురుచరణుడు నోట్లోనుంచి హుక్కా గొట్టంతీసి "ఎందుకులేదు? బాగానే వున్నది." అన్నాడు.

"అయితే ఆఫీసులో ఏమన్నా" తర్వాత గిరీనుడు సంకోచముతో పూర్తిచేయలేదు.

"ఎప్పే అలాంటి దేమీలేదు." అని గురుచరణుడు గిరీన్ ముఖం వంక జూశాడు. వారి లోపలవున్న ఉద్వేగాన్ని, ఎంత అమాయకుడయినా ముఖంచూసి కనిపెట్టవచ్చును.

లలిత ఇదివరకు మాట్లాడేదికాదు. కాని ఇప్పుడిప్పుడే మధ్య మధ్య ఒకటి రెండు మాటలు కలుపుతూ వున్నది. 'అవును మామా! ఇవ్వాళ నీ మనస్సు బాగాలేదు' అన్నది.

గురుచరణుడు పక పక నవ్వి "ఓ, అదా సంగతి! అవును తల్లీ. నువ్వుసరిగ్గా కనిపెట్టావు. ఇవ్వాళ నామనస్సు బాగాలేదు." అని అన్నాడు.

లలితా గిరీనులు వారి ముఖంవంక చూస్తూ ఫూరుకున్నారు.

"నాస్థితంతా ఎరిగి కూడా నవీనదా సన్ను రోడ్డుమీద నిలబెట్టి కొంచెం కటువుగా మాట్లాడాడు. వారి తప్పు కూడా ఏముందిలే. ఆరు మాసాలయింది; అసలు అలా ఉంచి వడ్డీ కూడా ఒక్క దమ్మిడీ యివ్వ లేదు" అని అన్నాడు.

సంగతి గ్రహించి ప్రసంగాన్ని అణచివేయటానికి లలిత చాలా వ్యాకులత చెందినది. ప్రపంచజ్ఞానం తెలియని మామ, ఇతరుల యెదుట లజ్జాకరమైన ఇంటి సంగతులు వెల్లడిస్తాడేమోననీ ఆదుర్దాతో "నువ్వు దాన్నిగురించి ఆలోచించకు మామా, అది తర్వాత చూడవచ్చును"అన్నది.

కాని గురుచరణుడు ఆమె ఉద్దేశం గ్రహించలేదు. విషణ్ణభావంతో నవ్వి "తర్వాత ఇంకేమి చూస్తావు తల్లీ? అదికాదు గిరీన్! మా యీతల్లి, వాళ్ళ ముసలబ్బాయి ఏమన్నా దిగులుపడుతాడేమోనని విచారిస్తూఉంటుంది. కాని బయటివారెవ్వరూ మీ దుఃఖిత మామ ముఖాన్ని చూడదలచటం లేదు లలితా!" అని అన్నాడు.

"ఇవ్వాళ నవీనబాబు ఏమన్నాడు?" గిరీను లడిగాడు.

గిరీనుకు ఈ సంగతంతా తెలుసునని లలిత ఎరగదు. అందుచేత ఈ ప్రశ్న అసంగతమైనదని లలిత కుపితురాలయింది.

"నవీనరాయ్ భార్యకు చాలారోజులనుంచి అజీర్ణవ్యాధి అట. ప్రస్తుతము రోగం కొంచెం ఎక్కువయింది. డాక్టరు గాలిమార్పు అవసరమన్నాడట. ఇప్పుడు డబ్బు అవసరం. అందుచేత వడ్డీ మొత్తమూ, అసలులో కొంతా ఇవ్వవలసి వుంటుంది" అని గురుచరణుడు చెప్పాడు.

గిరీన్ ఒక్క క్షణం ఉండి "మీకు ఒక మాట చెప్పాలని చాలా రోజులనుంచి అనుకుంటూనే చెప్పలేకుండా వున్నాను. మీరు మనస్సులో వేరుగా భావించకపోతే చెప్పతాను" అని మెల్లగా అన్నాడు.

గురుచరణుడు నవ్వి "నాతో చెప్పటానికి ఎవ్వరూ సంకోచించరు, గిరీన్! ఏమిటి సంగతి?" అని అడిగాడు.

"నవీనబాబుది పెద్ద వడ్డీ అని అక్కయ్య చెప్పింది. నా దగ్గర చాలా డబ్బు ఊరకనే పడి ఉంది. ఎందుకూ ఉపయోగించటంలేదు. పైగా వారికి అవసరమని కూడా అంటున్నారు. ఈ అప్పు తీర్చివేయకూడదా?"

లలితా గురుచరణు లిద్దరూ ఆశ్చర్యంతో అతనివంక చూస్తూ వుండిపోయారు. గిరీనుడు సంకోచముతో చెప్పనారంభించాడు.

"చూడండి. ఇప్పుడు నాకు డబ్బుతో అంత అవసరంలేదు. మీకు వీలుగా వున్నప్పుడు తీర్చివేయవచ్చును. వారికి అవసరమని అంటున్నారు కాబట్టి——"

"పైకమంతా నువ్విస్తావా?" అని గురుచరణుడు మెల్లగా అడిగాడు.

"ఆఁ, వారికి అవసరమయేటట్లయితే" అని, గిరీన్ తల వంచుకున్నాడు.

గురుచరణుడు ఏదో జవాబివ్వబోతూన్న సమయాన అన్నాకాళీ పరిగెత్తుకుంటూ వచ్చి "ఒదినా! జర్దీ. శేఖరదా గుడ్డలువేసుకు రమ్మం టున్నాడు. నాటకం చూడడానికి పోవాలి!" అని మళ్లా వచ్చిన విధంగానే పరుగెత్తుకొంటూ వెళ్ళింది ఆ పిల్ల ఆదుర్దాచూసి గురుచరణుడు నవ్వాడు. లలిత తొణకకుండా కూర్చున్నది.

ఒక్క క్షణమున్నాక మరల అన్నాకాళీ వచ్చి "ఏదీ ఇంకా లేవనే లేదే? మేమంతా నిలబడివున్నాము!" అని అన్నది.

అయినా లలితలో లేచే లక్షణాలేవీ కనబడలేదు. ఈ సంభాషణ చివరివరకు వినాలనుకున్నది. కాని గురుచరణుడు కాళీ ముఖంవంక చూసి మందహాసంచేసి లలిత తల నిమురుతూ "అయితే పో! తల్లీ! ఆల స్యము చేయకు. నీ కోసం అందరూ ఎదురు చూస్తున్నారట." అన్నాడు.

ఇక విధిలేక లలిత లేచింది. కాని వెళ్ళేముందు గిరీంద్రుని వంక కృతజ్ఞతతో చూసి మెల్లగా వెళ్ళిపోయింది. గిరీంద్రుడు అది గమ నించాడు.

పది నిముషాలు గడచినాక గుడ్డలవీ వేసుకుని తములపాకులు ఇవ్వాలనే నెపంతో లలిత మరోమాటు బయటగదిలోకి వచ్చింది. గిరీన్ అప్పటికి వెళ్ళిపోయాడు. గురుచరణుడు పడకకుర్చీలో కళ్లుమూసుకు పండుకొని ఉన్నాడు. అతని మూసిన కనుకొలకులనుండి నీరుకారుతూ వున్నది. అవి ఆనందాశ్రువులని లలిత గ్రహించి వారి ధ్యానభంగం చేయ కుండా వచ్చిన విధంగానే నిశ్శబ్దంగా వెళ్ళిపోయింది.

కొంచెముసేపటికి ఆమె శేఖరుని గదిలో ప్రవేశించింది. అప్పటికి ఆమె కండ్లల్లోకూడా నీరు నిండింది. అక్కడ అన్నాకాళీలేదు అందరి కంటే ముందుగాపోయి బండిలో కూర్చున్నది. శేఖరుడు ఒక్కడే గదిలో

నిలబడి ఉన్నాడు. బహుశా, లలిత కోసం ఎదురుచూస్తూ వున్నాడను కుంటాను. తలఎత్తి కన్నీటితో బరువయిన లలిత నేత్రాలు చూశాడు.

ఈ వారం పదిరోజులనుంచి లలిత కనబడక పోవడంచేత శేఖరుడు లోలోపల చాలా విరక్తుడయినాడు. కాని ఇప్పుడు అది అంతా మరచి పోయి "అదేమిటి, ఏడుస్తున్నావా?" అని అడిగాడు.

లలిత లేదన్నట్లు తల విసురుగా తిప్పింది.

కొన్ని దినాలనుంచి లలిత దొద్దుగా కనపడక పోవటంచేత శేఖరుని లో ఏదో మార్పు గలిగింది. అందుచేత అతను దగ్గరకువచ్చి లలిత రెండు చేతులూ పట్టుకొని ముఖం పైకెత్తి "నిజంగానే ఏడుస్తున్నావే! ఎందుకు?" అని ప్రశ్నించాడు.

లలిత ఇక తనను సంబాళించుకోలేక పోయింది. అక్కడే నిలబడి చెరగుతో ముఖం కప్పుకుని భోరున ఏడ్చింది.

## ౬

నవీనరాయ్ వడ్డీ అసలు దమ్మిడీలతో సహా లెక్కకట్టి తీసుకుని తాకట్టు దస్తావేజు గురుచరణునికి ఇస్తూ "సరేకాని ఈ డబ్బు ఎక్కడిది తెచ్చావోయ్!" అని అడిగాడు.

"అది అడగబోకు అన్నయ్యా, చెప్పనని మాట యిచ్చాను" అన్నాడు గురుచరణుడు వినయంగా.

డబ్బువసూలు అయినందుకు నవీనుడికి ఏ మాత్రమూ సంతోషం కలగలేదు. ఈ అప్పు వసూలవుతుందని అనుకో లేదు. ఇల్లు కలుపుకో వాలనే లెఖ్ఖలో ఉన్నాడు.

"ఇప్పుడు ఎన్ని మాటలైనా ఇస్తావు! అసలు, తప్పు నీదికాదు భాయీ, నాది. డబ్బుమళ్లీ అడగడమే తప్పు. లేకపోతే కలికాలం అని ఎందుకంటారు" అన్నాడు శ్లేషగా.

"అదేంమాట అన్నయ్యా! మీ ధనరుణం తీర్చానుగాని మీ దయా రుణం ఇంకా తీర్చనేలేదు." అన్నాడు గురుచరణుడు వ్యధితుడై.

నవీనుడు నవ్వాడు. ఇతను బోలెడు ప్రపంచం చూశాడు. ఇలాంటి మాటలు నమ్మినట్లయితే బెల్లం వ్యాపారములో ఇంత ధనమే సంపాయించేవాడు కాడు.

"భాయీ, నువ్వు నిజంగా అలా భావించినట్లయితే ఇలా అప్పు తీర్చేవాడివే కాదు. నాతప్పు ఏమున్నది. కొంత పైకం అడిగాను! అది కూడా నాకోసంకాదు: మీ ఒదినె కోసం. సరేకాని ఎంతవడ్డీకి ఇల్లుతాకట్టు పెట్టావు?"

"తాకట్టు పెట్టలేదు. వడ్డీసంగతి కూడా మాట్లాడుకో లేదు"

నవీనుడికి నమ్మకం కలగలేదు. "ఏమిటీ? చేబదులుగానే?" అని అడిగాడు.

"ఔను. అన్నయ్యా! ఒకవిధంగా అంతే. కుర్రవాడు చాలా మంచి వాడు."

"కుర్రవాడా? ఏకుర్రవాడు"

గురుచరణుడు ఈప్రశ్నకు జవాబివ్వలేదు. ఈకాస్తా వెళ్ళబెట్టటమే తనది పొరపాటని గ్రహించాడు.

నవీనుడు అతని మనోభావాన్ని గుర్తించి మందహాసం చేస్తూ "నిషేధం ఉన్నపుడు చెప్పకుండా వుండడమే మంచిది. భాయీ! నేను అనుభవంమీద చెప్తున్నాను. కొంచెం జాగ్రత్తగా వుండటం ఎందు

కైనా మంచిది. మంచికిపోయి ఆఖరికి మెడకు తెచ్చుకుంటావు." అన్నాడు.

గురుచరణుడు ఈ మాటకు జవాబియ్యకుండా నమస్కారం చేసి కాగితం చేతపట్టుకొని ఇంటికి వెళ్ళిపోయాడు.

భువనేశ్వరి అప్పుడప్పుడు కొంతకాలం పడమటకుపోయి వుండి వస్తూ ఉంటుంది. ఆమెకు అజీర్ణవ్యాధి. కాని అంత ప్రమాదకరమైనది కాదు. ఈ యాత్ర ఆమెకు ఉపయోగిస్తూ ఉండేది. నవీనుడు ఆనాడు తనపని సానుకూలం చేసుకోవటానికి ఈజబ్బును కొంచెం పెంచిచెప్పాడు. ఏకారణం చేతనైనా ధైనీయండి, ప్రయాణసన్నాహాలు మాత్రం జరుగు తున్నవి.

ఆవాళ ఉదయం శేఖరుడు సూటుకేసులో అవసరమైన ప్రయాణ సామగ్రిని పెట్టుతూ ఉండగా అన్నాకాళీ గదిలోకివచ్చి "శేఖరదా! మీరు రేపేకాదూ వెళ్ళేది?" అని అడిగింది.

శేఖరుడు దృష్టి పెట్టెమీదనుంచి మరల్చి "కాళీ, మీ పదినెను ఒక మాటు పిలువు, వెంట ఏమేమి తీసుకుపోవాలో పెట్టెలో సర్దుతుంది." అన్నాడు.

"మావదినె ఈమాటురాదు" అన్నది కాళీ తలతిప్పుతూ.

"ఎందుకు రాదు?"

"బాగా ఉంది! ఎలా వస్తుంది? మాఘ మాసంలో పెళ్ళి. నాన్న వరుణ్ణి వెదుకుతున్నాడుగా! "

శేఖరుడు స్తబ్ధుడై రెప్ప వాల్చకుండా చూస్తూ ఊరకున్నాడు.

కాళీ వాళ్ళ యింట్లో విన్న సంగతులన్నీ గడగడ చెప్పనారంభించింది.

"ఎంత డబ్బయినా కానీ మంచి పాత్రను చూడమని గిరీన్‌బాబు చెప్పాడు! నాన్న ఇవ్వాళకూడా ఆఫీసుకు వెళ్ళడు. భోంచేశాక ఎక్కడకో కుర్రవాణ్ణి చూడటానికి పోతున్నాడు—వెంట గిరీన్‌బాబుగూడా పోతాడు."

శేఖరుడు స్థిరంగా కూర్చుని వింటున్నాడు. లలిత ఇప్పుడు రాక పోవటానికి కారణమేమిటో అతనికి తెలిసింది. ఇంతేకాదు, ఇంకా చాలా సంగతులుకూడా అతను ఊహించుకున్నాడు. కాళి ఇంకా చెప్పుతూనే ఉన్నది.

"గిరీనుబాబు చాలా మంచివాడు శేఖరదా! అక్కయ్య పెళ్ళికి మా ఇల్లు పెదనాన్నకు తాకట్టు పెట్టాము; అదింకా రెండు మాసాలుదాకా తీర్చకపోతే మేము బజారులో బిచ్చమెత్తుక తిరగాల్సి వచ్చేదట! అందు కనే గిరీన్‌బాబు పైకము యిచ్చాడు. నిన్ననే నాన్న అప్పుతీర్చి వచ్చాడు. ఇక మా కేమీ భయములేదని ఒదినె అంటున్నది. నిజము కామా శేఖ రదా."

శేఖరుడు జవాబేమీ చెప్పలేక పోయాడు. అలానే చూస్తూ ఊర కున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు శేఖరదా" అని కాళి అడిగింది.

ఈ మాటు శేఖరునికి కొంచెం స్పృహ వచ్చింది. తడబడుతూ "ఏమీ లేదే కాళీ! మీ వదిన్ని నేను త్వరగా రమ్మన్నానని చెప్పు. పో, ఇక్కడ ఉన్నట్టు!" అని అన్నాడు.

కాళి పరుగె తింది.

పిలుపువిని లలిత పైకివచ్చి ముందుకిటికీ సందులోనుంచి చూసింది. శేఖరుడు నేలవంక చూస్తూ క్రింద కూర్చుని వున్నాడు. అతని ముఖం ఇలా ఉండటం ఆమె ఎప్పుడూ చూడలేదు. లలితకు ఆశ్చర్యం కలిగింది.

భయంకూడా వేసింది. నెమ్మదిగా గదిలోకివచ్చి నిలబడగానే "రా!" అని తొట్రుపాటుతో శేఖరుడు లేచి నిలబడ్డాడు.

"నన్ను పిల్చావా?" అని లలిత మెల్లగా అడిగింది.

"ఆఁ!" అని ఒక్క క్షణం శేఖరుడు మాట్లాడకుండా వుండి "రేపు ఉదయం బండికి నేను అమ్మను తీసుకొని పడమట వెళ్ళుతున్నాను. ఈ మాటు తిరిగి వచ్చేవరకు ఆలస్యం కావచ్చు. ఇదిగో తాళంచెవి, నీ ఖర్చుకు కావలసిన పైకం ఆ సొరుగులోనే ఉన్నది."

ప్రతిసారి లలిత వెంట ఉండేది. క్రిందట ప్రయాణానికి ఎంతో ఉత్సాహంతో పెట్టెలో సామాను సర్దింది. ఈమాటు శేఖరుడా ఒక్కడే ఆ పని చేస్తున్నాడు—తెరచిన పెట్టెవంక చూడగానే లలితకి ఈ సంగతి జ్ఞాపకం వచ్చింది.

శేఖరుడు ఆమె వైపునుంచి దృష్టి మరల్చి ఒకమాటు దగ్గి గొంతు సవరించుకొని "జాగ్రత్తగా వుండు! ఇంకేదన్నా ముఖ్యావసరముంటే అన్నయ్యనడిగి చిరునామా తెలుసుకొని ఉత్తరంరాయి" అన్నాడు.

తర్వాత ఇద్దరూ నిశ్శబ్దముగా ఊరకున్నారు. ఈమాటు తాను వెంట రావటంలేదని శేఖరుడా తెలుసుకున్నాడు. బహుశా దానికి కారణంకూడా వినివుంటాడని భావించి లలిత క్రుంగిపోయింది.

"సరే నీవికపోవచ్చు. నేను మళ్ళీ యివన్నీ సర్దుకోవాలి. వేళచాలా మిగిలింది. ఒకమాటు ఆఫీసులోకికూడా పోయిరావాలి!" అన్నాడు శేఖరుడు నిశ్శబ్దాన్ని భంగపరచి.

లలిత తెరచిన పెట్టెముందు మోకాళ్ళమీద కూర్చుని "మీరు స్నానం చేయండి. నేను సర్దుతాను" అన్నది.

"ఐతే మంచిదే!" అని తాళపుచెవులగుత్తి లలితముందువేసి గది

బయటదాకావచ్చి ఆగి "నా కేమేమి అవసరమో మరచిపోవుకదా?" అని అన్నాడు.

లలిత తలవంచుకొని పెట్టెలోని వస్తువులను పరీక్షించ నారంభించింది. జవాబివ్వలేదు.

శేఖరుడు క్రిందికివెళ్ళి తల్లిని అడిగి కాళీ చెప్పినదంతా సత్యమేనని తెలుసుకున్నాడు. గురుచరణుడు అప్పుతీర్చిన సంగతి నిజమే. లలితకు వరుణ్ణి వెతుకుతున్న మాటకూడా యాథే! అతను ఇకేమీ అడగకుండా స్నానం చేయటానికి వెళ్లిపోయాడు.

గంటా రెండుగంటల తర్వాత స్నానాహారాలు నిర్వర్తించుకొని ఆఫీసు దుస్తులు వేసుకోటానికి శేఖరుడు గదిలోకివచ్చి నిజంగా స్తంభితుడయిపోయాడు. ఈ రెండు గంటల్లో లలిత ఏమీ చేయలేదు. తెరచిన సూటుకేసు మూతమీద తల పెట్టి ప్రతిమవలె కూర్చున్నది. శేఖరుని కాలిచప్పుడు విని చకితురాలై తలఎత్తి చూచి మరల తల వంచుకున్నది. ఆమె కళ్ళు రెండూ జపాపుష్పాలవలె ఎర్రనైనవి.

కాని శేఖరుడు ఇది గమనించికూడా గమనించలేదు. ఆఫీసు దుస్తులు వేసుకుని చాలా సహజంగా "ఇప్పుడు నీవల్లకాదు లలితా, మధ్యాహ్నం వచ్చి సర్దు." అని ఆఫీసుకు వెళ్ళిపోయాడు. లలిత కళ్లు ఎర్రబడటానికి కారణ మేమిటో అతను గ్రహించాడు. కాని అన్నివైపులా బాగా ఆలోచించి చూడందే అతను ఏమనటానికీ సాహసించలేక పోయాడు.

ఆవాళ మధ్యాహ్నం లలిత టీ తీసుకువచ్చి వాళ్ళ మామదగ్గర శేఖరుడు కూర్చుని వుండటంచూసి స్తంభించిపోయింది. శేఖరుడు ఇవాళ గురుచరణబాబు దగ్గర సెలవు తీసుకోవటానికి వచ్చాడు.

లలిత తలవంచుకొని రెండుకప్పుల టీ తయారుచేసి ఒకటి గిరీన్

ముందూ రెండోది మామముందూ పెట్టగానే "శేఖరబాబుకు టీ ఇవ్వలే దేమి లలితా!" అని గిరీనుడు అడిగాడు.

"శేఖరదా టీ త్రాగడు." అని లలిత తల ఎత్తకుండానే మెల్లగా అన్నది.

గిరీన్ ఇక ఏమీ అనలేదు. అతనికి లలిత టీ త్రాగని సంగతి జ్ఞాపకం వచ్చింది. "శేఖరుడు టీ త్రాగడు. ఇతర్లు త్రాగటానికి కూడా ఇష్టపడడు."

టీ కప్పు పైకెత్తి గురుచరణుడు వరుని సంగతి ఎత్తాడు. కుర్ర వాడు బి. ఏ. చదువు తున్నాడని మొదలుపెట్టి అతని గుణగణాలన్నీ వర్ణించి చివరకు అన్నాడు.

"కాని మా గిరీనుకు నచ్చలేదు. నిజానికి కుర్రవాడు చూపులకు అంత బాగుండడు. కాని మగవాళ్ళ చక్కదనం యెందుకు ఉపయోగి స్తుంది? గుణాలుంటే చాలు!"

ఏదోవిధంగా వివాహం అయిపోతే గురుచరణునికి స్వస్థతచిక్కు తుంది.

శేఖరునికీ గిరీనుకూ ఇదే ప్రథమ పరిచయం. శేఖరుడు అతని వంక చూచి మందహాసం చేస్తూ "గిరీనుబాబుకు ఎందుకు నచ్చలేదు? కుర్రవాడు చదువుతూ వుండె, స్థితికూడా బాగావుండె; ఇంతకంటె మంచి వాడెక్కడ దొరుకుతాడు?" అని అడిగాడు.

శేఖరుడు అడిగాడేకాని గిరీనుకు ఇప్పుడు ఎందుకు నచ్చనిదీ, ఇక ముందు కూడా ఎందుకు నచ్చనిదీ ఎరుగును. కాని గిరీనుడు ఈ ప్రశ్నకు వెంటనే జవాబివ్వలేక పోయాడు. కొంచెం సిగ్గుకూడా పడ్డాడు. శేఖరుడు అది గమనించి లేచి నిలబడి "కక్కాయి! రేపు అమ్మను తీసుకుని పద

మట వెళ్లుతున్నాను. సమయానికి కబురు చేయటం మరిచిపోయేవు!" అని అన్నాడు.

"అదెలాబాబు! మీరుతప్ప మాకింకెవ్వరున్నారు? అదికాక తల్లి లేకపోతే ఇక్కడ పెళ్ళిపనులెలా జరుగుతాయి. నువ్వేమంటావు లలితా?" అని వెనక్కు తిరిగిచూసి "ఎప్పుడో లేచి పోయిందే!" అని అన్నాడు.

"ఈ మాటలు రాగానే లేచిపోయింది" అన్నాడు శేఖరుడు.

గురుచరణుడు గంభీరభావంతో "పోక యేం చేస్తుంది? ఎలా అయినా కొంచెం జ్ఞానం వొచ్చిన పిల్లగా!" అని చిన్న నిట్టూర్పు విడిచి "మా తల్లి ఒక మాటే లక్ష్మీ, సరస్వతీ! ఇలాంటి పిల్ల మంచి అదృష్ట వంతులకు గాని లభించదు, శేఖరనాద్!" అన్నాడు.

౭

లలిత టీపార్టీనుంచి చెప్పకుండా పారిపోయివచ్చి శేఖరుని గదిలో ప్రవేశించి గ్యాస్‌లైటు వెలుతురున పెట్టెతెరచి శేఖరుని ఉన్ని గుడ్డలు సర్ద నారంభించింది. కొంచెముసేపటికి శేఖరుడుకూడా గదిలోకి వచ్చాడు. అతని ముఖంచూసి భయంతోనూ విస్మయంతోనూ లలిత స్తంభితురాలయింది.

వ్యాజ్యంలో సర్వస్వమూ ఓడిపోయిన మనిషి ఎలాంటి ముఖంతో కోర్టులోనుంచి బయటికి వస్తాడో, ఒక్క గంట క్రింద జూసిన వ్యక్తి కూడా అతన్ని ఎలా గుర్తింపజాలడో, అలానే ఈ ఒక్క గంటలో లలిత శేఖరుని ముఖం గుర్తింపజాలక పోయింది. అతని ముఖంమీద సర్వస్వమూ పోగొట్టుకున్న చిహ్నాలు కాలుతూ ఉన్న ఇనుముతో ఎవరో రక్ష వేసినట్టు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"ఏం చేస్తున్నావు లలితా?" అని శేఖరుడు పొడిగొంతుకతో అడి గాడు.

లలిత ఆ ప్రశ్నకు జవాబివ్వకుండా శేఖర్ని రెండు చేతులూ పట్టుకొని—"ఏమిటి అలాఉన్నావు శేఖరిదా?" అన్నది రోదన స్వరంతో. "ఎలా ఉన్నాను!" అని శేఖరుడు బలవంతాన నవ్వాడు. లలిత కరస్పర్శ మూలాన అతని ముఖాన కొంచెం జీవం వచ్చింది. అతను దగ్గరలోవున్న కుర్చీలో కూలబడి "నువ్వేమిచేస్తున్నావు లలితా?" అని మరల ప్రశ్నిం చాడు.

'ఓవరు కోటు ఇందులో పెట్టటం మరచిపోయాను. అదే తీసుకు వచ్చాను.'

లలిత ఇప్పటికి కొంత తెప్పరిల్లుకున్నదని శేఖరుడు గ్రహించాడు. లలిత చెప్పనారంభించింది:

"క్రిందటిసారి బండిలో మీరు చాలా ఇబ్బంది పడ్డారు. కోట్లుచాలా ఉన్నాయి కాని కొంచెం మందంగా ఉన్నది ఒక్కటికూడాలేదు. అందుకని నేను తిరిగి రాగానే దర్జీకి కొలతలిచ్చి యిది తయారు చేయించాను." అని మొద్దుగా ఉన్న ఒక ఓవరుకోటు తెచ్చి శేఖర్ని ముందుపెట్టింది.

శేఖరుడు దాన్ని చేత్తోపరీక్షించి - "ఎప్పుడూ? నాకు చెప్పనేలేదే! అన్నాడు.

లలితనవ్వి "మీరు 'బాబు' లైతిరి! మీకు చెప్పితే యింత మొద్దు తయారు చేయనిచ్చేవారా? అందుకనే చెప్పలేదు; కుట్టించి అట్టేపెట్టాను" అని ఆకోటు యథాస్థానంలో పెట్టి, "సరిగ్గా పైనే ఉంది పెట్టె తెరవ గానే కనపడుతుంది. చలివేస్తే తొడుక్కోవటం మర్చిపోయేరు" అని జ్ఞాపకం చేసింది.

"సరే!" అని శేఖరుడు కొంచెంసేపు రెప్పవాల్చకుండా లలితవంక చూసి, "ఉహు, అది అసంభవం!" అని అన్నాడు.

"ఏది అసంభవం? తోడుగోవటమా?" అని లలిత అడిగింది.

శేఖరుడు తడబడుతూ, "కాదు, ఆసంగతికాదు. అది ఇంకోసంగతి! సరే లలితా సామాన్లు సర్దటం అయిందేమో అమ్మను కనుక్కున్నావా?" అన్నాడు.

"ఆ మధ్యాహ్నంపూట అంతా నేనే సర్దాను." అని ఒక్కమాటు మరల అన్ని వస్తువులు పరీక్షించి పెట్టెకు తాళం వేయసాగింది.

శేఖరుడు ఒక్కక్షణం ఆమెవంకచూసి, "సరేగాని లలితా! వచ్చే సంవత్సరం నాకివన్నీ ఎవరు సర్దుతారో చెప్పగలవా?" అని మృదుస్వరంతో అడిగాడు.

లలిత శేఖరుని వైపుకు తిరిగి, "ఎందుకు? అన్నది.

ఎందుకో నాకు బాగా తెలుసును, అని మనసులో అనుకొని తాను ఎత్తిన ప్రసంగాన్ని మార్చాలనే ఉద్దేశముతో వాడిపోయిన ముఖం మీదికి బలవంతాన నవ్వు తెచ్చిపెట్టుకొని "కాని వరుల ఇంటికి పోకముందు ఎక్కడెక్కడ ఏమేమి ఉన్నదో నాకు చూపించిపో లలితా, లేకపోతే అవసరం వచ్చినప్పుడు నాకేదీ దొరకదు!" అన్నాడు.

"పోండి!" అన్నది లలిత కోపం తెచ్చుకొని.

శేఖరునికి ఇప్పుడు నవ్వు వచ్చింది.

'పోవటం నాకు తెలుసు, కాని వచ్చేసంవత్సరము నేనేమి చేసేది? నాకు సర్దా అయితే పదహారణాలున్నది: కాని, శక్తి దమ్మిడీదికూడాలేదు. ఈ పనులన్నీ నౌకర్లు చేస్తే కుదరదు—ఇక నేనుకూడా మీ మామయ్యారిగా

ఒక జత దుస్తులలోనే ఉండవలసి వచ్చేటట్టున్నది! సరే, ఏమి చేస్తాము. జరగాల్సిందేదో జరుగుతుంది:' అని శేఖరుడు నిరుత్సాహంతో అన్నాడు.

లలిత తాళపుచెవులగుత్తి మేజామీద పారవేసి పారిపోయింది.

'రేపు ఉదయం ఒకమాటురా!' అని శేఖరుడు కేకవేశాడు.

లలిత వినికూడా వినిపించుకోలేదు. తొందరగా మెట్లుదిగి వాళ్ళ మిద్దెమీదికి పోయింది. అన్నాకాళీ మిద్దెమీద వెన్నెల్లో కూర్చుని ఒక రాసి బంతిపూలు ముందువేసుకొని దండ గుచ్చుతూ ఉన్నది. లలిత ఆ పిల్ల దగ్గరకుపోయి—"మంచులో కూర్చుని ఏమి చేస్తున్నావు కాళీ?" అని అడిగింది.

"దండ గుచ్చుతున్నాను. ఇవ్వాళ రాత్రికే మా అమ్మాయి పెళ్ళి!" అన్నది కాళీ తలఎత్తకుండానే.

"ఏదీ, నాకు చెప్పలేదే?"

"ఇందాకటిదాకా స్థిరపడలేదు వదినా! ఇప్పుడే నాన్న పంచాంగం చూసి ఇవ్వాళ రాత్రికి తప్ప ఇక ఈ మాసంలో లగ్నమేలేదని చెప్పాడు. ఈడువచ్చిన పిల్ల. ఇక అట్టే పెట్టలేను. ఎలాగో ఒకలా సాగనంపుతున్నాను.—ఒదినా! నాకు రెండు రూపాయలుంటే ఇవ్వు. మిఠాయి తీసుకురావాలి!"

"డబ్బు కావల్సి వచ్చేవరకు వదినా ? సరే పో. నా దాలీసుకింద ఉన్నాయి, తీసుకుపో!" అని కొంచెం ఆలోచించి—"ఏమే కాళీ, బంతి పూలతో పెళ్ళి అవుతుందంటే?" అని నవ్వుతూ అడిగింది.

కాళీ గంభీర భావంతో—"అవుతుంది! ఇతర పూవులేవీ దొరకక

పోతే అవుతుంది! నేను ఎంతమంది పిల్లల్ని విరగడచేశాను వదినా, నాకంతా తెలుసు!" అని ఫలహారాలు తీసుకురావటానికి క్రిందకు వెళ్ళింది.

లలిత అక్కడే కూర్చుని దండగుచ్చుతూ ఉన్నది.

కాసేపటికి కాళి తిరిగివచ్చి—"అందరినీ పిలిచాను వదినా! ఒక్క శేఖరదాను మాత్రం పిలవలేదు. పోయి చెప్పివస్తాను—లేకపోతే వారికి కష్టంగా ఉంటుంది!" అని వెళ్ళిపోయింది.

కాళి పక్కా గృహిణి. ఆమె పనులన్నీ సక్రమంగా, ఏమీ పొల్లు పోకుండా చేస్తున్నది. శేఖరునికికూడా చెప్పి దిగివచ్చి—"వారికి ఒక దండ కావాలట వదినా, త్వరగాపోయి ఇచ్చిరారాదూ? అంతలోకి నేను మిగతా పనులన్నీ చూస్తాను. ఇక వ్యవధిలేదు—లగ్నం దగ్గరకు వచ్చింది" అన్నది.

"నావల్లకాదు కాళీ! నువ్వే ఇచ్చిరా!" అన్నది లలిత.

"సరే పోతాను. ఆ పెద్దదండ ఇలా ఇవ్వు" అని కాళి చేయి చాపింది.

లలిత దండ ఇవ్వబోయి మరల ఏదో ఆలోచించి—"సరే, నే నే ఇచ్చి వస్తాను!" అన్నది.

"అలాగే పో ఒదినా! నాకు బోలెడు పనులు—చావటానికికూడా తీరికలేదు!" అన్నది కాళి గంభీరంగా.

ఆ పిల్ల ముఖభంగిమా, మాటలతీరూ చూచేవరకు లలితకు నవ్వాగ లేదు. "పెద్ద నాపసానివి!" అని నవ్వుతూ దండ తీసుకువెళ్ళి పోయింది. వాకిటిదగ్గరకువచ్చి చూసేవరకు శేఖరుడు మహానందంతో ఏదో ఉత్తరం వ్రాస్తున్నాడు. లలిత తలుపుతెరచుకొని వెనక్కవచ్చి నిలబడినా శేఖరుడు గమనించలేదు లలిత ఒక్క క్షణంకాలం అలాగే నిశ్శబ్దంగా ఉండి,

శేఖరుని చకితుని చేయాలనే అభిప్రాయంతో ఆ దండను జాగ్రత్తగా—అతని తలకు తగులకుండా—మెడలోవేసి కుర్చీచాటున కూర్చున్నది.

శేఖరుడు మొదట చకితుడయి—"ఏయ్ కాశీ?" అని తర్వాత వెనక్కుతిరిగిచూసి మహా గంభీరంగా—"ఏమిటి నువ్వు చేసింది లలితా?" అన్నాడు.

లలిత లేచి నిలబడి శేఖరుని ముఖభంగిమచూసి శంకితురాలయి—"ఏది. ఏం చేశాను?" అన్నది.

శేఖరుడు గాంభీర్యాన్ని ఏమి తగ్గనివ్వకుండా—"తెలియదా ఏమిటి? తెలియకపోతే కాశిని కనుక్కురా—ఇవ్వాళ రాత్రి మెడలో దండవేస్తే ఏమవుతుందో!" అన్నాడు.

లలిత తాను చేసిన పని ఏమిటో ఇప్పుడు తెలుసుకున్నది. కను రెప్ప పాటులో ఆమె ముఖమంతా లజ్జచే ఎర్రబడింది—"అదికాదు! ఎప్పటికీ కాదు!" అంటూ బయటికి పరుగుపెట్టింది.

"పోబోకు లలితా. మాట—చాలా అవుసరమైన పని ఉంది." అని శేఖరుడు కేక వేశాడు.

శేఖరుని పిలుపు ఆమె చెవిని పడింది. కాని ఎందుకు వినిపించుకొంటుంది? ఎక్కడా ఆగకుండా తన గదిలోకి వెళ్లి పక్కమీద పండుకున్నది.

లలిత ఆయిదారు సంవత్సరాలనుంచి శేఖరుని సంరక్షణలోనే పెరిగింది. కాని. ఎప్పుడూ ఇలాంటి మాటలు వినలేదు! అసలు. గంభీర ప్రకృతికి చెందిన శేఖరుడు ఆమెను ఎన్నడూ పరిహాసం చేసేవాడు కాడు. చేసినాకూడా ఇంత లజ్జాకరమైనమాట అతని నోటనుంచి వెలువడుతుందని ఆమె ఊహించనేలేదు. ఆమె సిగ్గుతో సగంచచ్చి, కొంచెంసేపు అలానే పండుకొని తర్వాత లేచి శేఖరుని దగ్గరకు వెళ్ళుదామా వద్దా అని ఆలో

చిస్తున్నది. శేఖరుడంటే లలితకు తగనిభయం. చాలా అవుసరమైన పని ఉన్నదని పిలిచాడు. ఏంచేస్తుంది?

"లలితమ్మ ఎక్కడమ్మా, మాచినబాబుగారు పిలుస్తున్నారు." అంటూ దాసీవచ్చింది.

లలిత బయటకువచ్చి మృదుస్వరంతో - "నువ్వుపోవే, నేనువస్తు న్నాను." అని శేఖరుని గదిదగ్గరకువచ్చి తలుపుసందులోనుంచి చూచింది. శేఖరుడు ఇంకా ఉత్తరం వ్రాస్తూనే ఉన్నాడు. కొంచెంసేపు అలానే నిల బడి "ఎందుకూ? పిల్చింది!" అని మెల్లగా అడిగింది.

"దగ్గరకురా చెప్తాను!" అన్నాడు శేఖరుడు వ్రాస్తూనే.

"కాదు! ఇక్కడే ఉంటాను. చెప్పండి."

శేఖరుడు లోలోన నవ్వుకొని "ఇవ్వాళ హఠాత్తుగా ఇంలాటిపని చేశావేం, లలితా?" అన్నాడు.

"ఫోండి—మళ్ళీ!" అన్నది లలిత అలిగినట్టుగా.

"నాతప్పేమున్నది? నువ్వే చేసిపోయావు." అన్నాడు శేఖరుడు లలిత వైపుకుతిరిగి.

"ఏమీ చేయలేదు. అదండ నాకుతిరిగివ్వండి."

"అందుకోసమే మళ్ళీ పిలిపించా లలితా! దగ్గరకురా ఇస్తాను. నువ్వుసగం క్రతువుజరిపి పోయావు. ఇలారా, మిగతా సగం నేనుపూర్తి చేస్తాను!"

లలిత తలుపుచాటునే ఒక్కక్షణం మౌనంగా ఉండి "నిజంగా చెప్తున్నాను. అలా ఎగతాళిచేస్తే ఇక మీదగ్గరికి ఎప్పుడూరాను. అదండ తిరిగివ్వండి" అన్నది.

శేఖరుడు మరల టేబులువంకకు తిరిగి దండపైకెత్తి "తీసుకపో!" అన్నాడు:

"అక్కడనుంచే విసిరివేయండి!"

శేఖరుడు తలతిప్పుతూ "ఊహూ, దగ్గరకువస్తే ఇస్తాను. లేకపోతే ఇవ్వను" అన్నాడు.

"అయితే నాకక్కరలేదు" అని కోపంతో లలిత బయలుదేరింది.

"క్రతువు సగంలోనే ఆగిపోయింది" అని శేఖరుడు కేకవేశాడు.

"ఆగిపోతే పోనీండి" అని లలిత నిజంగా కోపంతోనే వెళ్ళిపోయింది.

వెళ్ళిపోయిందేగాని క్రిందకు పోలేదు. మిద్దె తూర్పు వైపుకు పోయి పిట్టగోడ పట్టుకొని నిలబడింది. ఎదుట చంద్రుడు. చుట్టూ శరత్కాలపు వెన్నెల పిండి ఆరబోసినట్టుగా ఉన్నది. పైన నిర్మల నీలాకాశం. లలిత ఒకమాటు శేఖరుని గదివంక చూసి మరల ఆకాశం వంక చూస్తూ ఉండిపోయింది. కోపంతో కూడిన సిగ్గుతోనూ అభిమానంతోనూ ఆమె కళ్ళు అశ్రుపూరితమైనవి. ఇప్పుడామె, ఈ మాటల తాత్పర్యం తెలియనంత బాలికకాదు. అయితే శేఖరుడు ఇవాళ ఇలాంటి నొచ్చే పరిహాసం ఎందుకు చేశాడు? తాను ఎంత తుచ్ఛురాలో, ఎంత హీనురాలో, ఇప్పుడిప్పుడే ఆమెకు తెలుస్తుంది అసహాయ, అనాధ - అనే అభిప్రాయంతోనే ఆమెను అందరూ ఆదరిస్తున్నారు; శేఖరుడూ ఆదరిస్తున్నాడు; అతని తల్లికూడా ఆదరిస్తున్నది! ఆమెకు నా అనేవారులేరు. నిజానికి, ఆమెబాధ్యత వహించిన వారు ఎవ్వరూ లేకపోవటం చేతనే. గిరీంద్రుడు తనకు సంబంధమేమీ లేకపోయినప్పటికీ, ఆమెను ఉద్ధరించటానికి పూనుకున్నాడు.

లలితకళ్ళు తుడుచుకొని మనస్సులో అనుకొన్నది:— ఈకలకత్తా సమాజంలో తన మామస్థితి శేఖరునితో పోలిస్తే ఎంతహీనం! అలాంటి మామకు తాను ఆశ్రితురాల్ని, గుదిబండ! ఇటు తనతో సమానుల ఇంట

శేఖరుని వివాహప్రసంగం జరుగుతూ ఉన్నది ఇవ్వాళ కాకపోతే ఇంకా నాలుగురోజులున్నా కయినా ఆసంబంధమే స్థిరపడుతుంది. ఈ పెళ్లికి నవీనరాయ్ ఎంత డబ్బు వడుకున్నంటాడో - దాని పూర్తి వివరాలు - లలిత శేఖరునితల్లి వద్ద వినిఉన్నది.

అయితే శేఖరుడివాళ హఠాత్తుగా ఆమెను ఎందుకవమానం చేశాడు? లలిత శూన్య దృక్కులతో ఎదురుగా చూస్తూ ఈ సంగతులన్నీ గాఢంగా ఆలోచిస్తున్నది.

పకపక నవ్వు విని చకితురాలయి లలిత వెనుకకు తిరిగి చూసింది- శేఖరుడు నవ్వుతూ ఉన్నాడు. ఇంతకు పూర్వం, తాను ఏ ఉపాయంతో శేఖరుని మెడలో దండ వేసిందో, సరిగ్గా ఆ ఉపాయంతోనే అదే బంతి పూల దండ ఆమె మెడలోకి తిరిగి వచ్చింది. దుఃఖం ఆమె కంఠానికి అడ్డుపడినా,బలవంతాన—"ఎందుకు యిలా చేశారు?" అని వికృతస్వరంతో అడిగింది.

"నువ్వెందుకు చేశావు?"

"నేనేమీ చేయలేదు." అని దండను తెంచివేయబోయి, శేఖరుని కళ్ళవంకచూసి ఆగిపోయింది. తెంచివేసే సాహస మామెకు కలగలేదు. కాని—"నాకెవ్వరూ లేరనేగా, మీరు నన్నిలా అవమానం చేసింది!" అన్నది ఏడుస్తూ.

శేఖరుడు ఇంతవరకు ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు. ఇప్పుడు లలిత మాటలు విని స్తంభించి పోయాడు. ఇవి చిన్నపిల్ల మాటలు కావు!

"నేను నిన్ను అవమానం చేశానా లేక నువ్వే నన్ను అవమానం చేశావా?" అన్నాడు శేఖరుడు.

లలిత కళ్లు తుడుచుకుని—''మిమ్మల్ని నేనెందుకు అవమానము చేశాను?" అన్నది భయపడుతూ.

శేఖరుడు ఒక్క క్షణం ఆగి చాలా మామూలు ధోరణిలో——"కొంచెం ఆలోచించి చూస్తే తెలుస్తుంది. అయినా, ఇప్పుడు నువ్వు చాలా హద్దుమీరి పోతున్నావు లలితా! అందుకనే యాత్రకు పోకముందు విన్నాక గిరిలో ఉంచి పోతున్నాను." అన్నాడు.

లలిత ఇక జవాబివ్వలేదు. తలవంచుకు నిలబడింది. పండు వెన్నెల్లో ఇద్దరూ నిశ్శబ్దంగా నిలబడి ఉన్నారు. అంతటా నిశ్శబ్దం. కూతురు పెళ్ళి చేసుకుంటూ కాశీ ఊదిన శంఖధ్వని మాత్రం. క్రింద నుంచి 'భోం భోం' అని వినపడసాగింది. కొంచెంసేపు మౌనంగా ఉండి శేఖరుడు—"ఇక మంచులో నిలబడకు, క్రిందకుపో!" అన్నాడు లలితతో.

"పోతున్నాను" అని లలిత ఇంతసేపటి తర్వాత అతని కాళ్ల ముందు మోకరిల్లి నమస్కరించి - లేచి - ''నన్నేమి చేయమంటారో చెప్పిపొండి!" అన్నది మెల్లగా.

శేఖరుడు నవ్వాడు. మొదటి కొంచెం సందేహించి తర్వాత రెండుచేతులతో లలితను దగ్గరకు లాక్కొని ఆమె అధరాన్ని ఓష్ఠాధరాలతో స్పృశించి - "ఇంకేమీ చెప్పనక్కర్లేదు లలితా. ఇవ్వాళనుంచి నీకే తెలుస్తుంది!" అన్నాడు.

లలితశరీరమంతా రోమాంచితమై కంపించింది. కొంచెం ఎడంగా పోయి నిలబడి - 'నేను మీమెళ్లో దండవేశాననేగా, ఇవ్వాళ మీరిలా చేసింది?" అని అడిగింది.

శేఖరుడు నవ్వుతూ తలత్రిప్పి - "కాదు! నేను చాలా రోజులనుంచీ అనుకొంటున్నాను. కాని స్థిరపరచుకోలేక పోయాను. ఇవ్వాళ స్థిరపడింది. ఎందుకంటే, నిన్ను వదలి ఉండలేనని నేనివాళే గ్రహించాను." అన్నాడు.

"కాని మీనాన్నగారు వింటే కోప్పడతారు. తల్లివింటే దుఃఖిస్తుంది. ఇది నెరవేరదు శేఖరదా"

"నాన్నవింటే కోప్పదేమాట నిజమే. కాని అమ్మ సంతోషిస్తుంది. సరే, తర్వాత ఏమైనా కానీయి, జరుగవలసిందేమో జరిగిపోయింది. ఇక నువ్వూ తప్పుకోలేవు, నేనూ తప్పుకోలేను! పద, క్రిందకు పోయి తల్లికి నమస్కరించు!"

౮

రెండు మాసాలు గడిచినాక ఒకనాడు గురుచరణుడు వాడిపోయిన ముఖంతో నవీనరాయ్ ఇంటికివచ్చి తివాసీమీద కూర్చోబోతూ ఉండగా నవీనుడు చీత్కారంచేసి - "వద్దు, వద్దు! అక్కడకాదు, ఆకుర్చీమీదికి పోయి కూర్చో. వేళకానివేళకు నేను మళ్లీ స్నానం చేయలేను. ఆఁ, జాతి వదులుకున్నావు కాదూ?" అని అడిగాడు

గురుచరణుడు దూరంగా పోయి ఒక కుర్చీలో తలవంచుకు కూర్చున్నాడు. నాలుగైదురోజుల క్రిందట అతను యధావిధిగా దీక్షపుచ్చుకుని బ్రహ్మసమాజంలో చేరాడు. ఆసమాచారమే చిత్రవిచిత్రముగా అలంకృతమై సనాతన హిందువైన నవీనుని చెవినిఃడింది. నవీనుని కళ్లవెంట అగ్నికణాలు రాలుతున్నవి. కాని గురుచరణుడు అలాగే తలవంచుకొని మౌనంగా కూర్చున్నాడు. అతను ఎవ్వరినీ పరామర్శించకుండా ఈపనిచేసినప్పటినుంచీ ఇంట్లో ఏడ్పులూ మొత్తుకోళ్లు ఎక్కువైనవి. అతనికి శాంతి అనేది లేకుండా పోయింది.

"చెప్పవోయి, నిజమూ కాదా?" అని నవీనుడు మరల గర్జించాడు.

గురుచరణుడు జలధారాక్రాంతమైన కళ్లు పైకెత్తి - "చిత్రం, నిజమే." అన్నాడు.

"ఎందుకు ఇలాంటిపని చేశావు? నీకు జీతం నెలకు అరవైరూపాయలేకదా, నువ్వు-" కోపంచేత నవీన్‌రాయ్ నోటనుంచి ఇక మాటపెగుల లేదు.

గురుచరణుడు కళ్లు తుడుచుకొని రుద్ధకంఠాన్ని కొంచెం సవరించి - "అప్పుడంతదూరం ఆలోచించ లేదన్నయ్యా! దుఃఖాగ్నిచే తపించడంచేత మెడకు ఉచ్చుపోసుకోవాలో, లేక బ్రహ్మజ్ఞానిని కావాలో - అప్పుడు ఏమీ నిర్ణయించుకో లేకపోయాను. చివరకు ఆత్మహత్యకంటే బ్రహ్మజ్ఞానిని కావటమే మంచిదని దీక్షతీసుకున్నాను." అని గురుచరణుడు కళ్లు తుడుచుకొంటూ బయటకు వెళ్లిపోయాడు.

"మంచిపనిచేశావు! నీమెడకు ఉచ్చుపోసుకోకుండా సమాజము మెడకు ఉరితాడు తగిలించావు! సరేపో, ఇక నీముఖం నాకు చూపించకు నీకు సలహా ఇచ్చినవాళ్లే తోడ్పడతారు - అని అతన్ని పంపివేసి ముఖం త్రిప్పుకు కూర్చున్నాడు.

మొదట కోపంతోనూ అభిమానంతోనూ నవీనుడు ఏమిచేయాలో నిశ్చయించుకోలేక పోయాడు. గురుచరణుడు పూర్తిగా చేతిలో నుంచి తప్పించుకు పోయాడు. త్వరలో గుప్పెట్లోకి వస్తాడనే ఆశకూడాలేదు. అందుచేతనే, నిష్ఫల ఆక్రోశంతో తపించిపోయి, అతన్ని లోబరచుకునే ఉపాయం ఏదీ కానక ఆరోజునే టాపీపనివాళ్లను పిలిపించి వారింటికీ వీరింటికీ వస్తూపోతూఉండే దోవకు అడ్డంగా పెద్దగోడ కట్టించాడు.

గురుచరణుని మతం మార్పు, చాలాదూరాన ప్రవాసంలో ఉన్న భువనేశ్వరి, శేఖరునోనోటవిని ఏక్కింది - "శేఖర్, ఇలాంటి బుద్ధి అత

నికి ఎవరు పుట్టించారు?'' అని అడిగింది.

బుద్ధి ఎవరు పుట్టించిందీ శేఖరుడు నమ్మకంగా ఊహించుకున్నాడు. కాని అట చెప్పకుండా- "పోనీ అమ్మా! రెండురోజులైన్నాక మీరే అతన్ని వెరివేశేవారు. లేకపోతే ఇంతమంది పిల్లల పెళ్లి ఎలాచేస్తాదో నాకు తోచటమేమీలేదు." అన్నాడు.

భువనేశ్వరి తలత్రిప్పుతూ- "ఏమీ దిగబడదు శేఖర్! అందుకోసం జాతిని వదులుకొంటే చాలా అయింది. సృష్టించిన భగవంతుడే ఆ భారం వహిస్తాడు!" అన్నది.

శేఖరుడు మాట్లాడలేదు, భువనేశ్వరి కళ్లు తుడుచుకుని అన్నది.

"మాలలితను వెంట తీసుకుని వస్తే దానిభారం నేనే వహించ వలసివచ్చేది; వహించే దాన్నికూడా! - గురుచరణుకు ఈ ఉద్దేశములోపల పెట్టుకునే దాన్ని పంపలేవని నాకేం తెలుసు? నేను నిజంగానే లలితకు సంబంధం కుదిరిందనుకున్నాను."

శేఖరుడు తల్లివంక చూసి కొంచెం సిగ్గుపడుతూ-" అయితే అమ్మా, ఇప్పుడు ఇంటికి పోయి అలా ఎందుకు చేయకూడదూ? లలిత ఇంకా బ్రహ్మసమాజంలో కలవలేదు. వాళ్ల మామే కలిశాడు. నిజానికి ఆయనకూడా లలితకు ఏమంత దగ్గరవాడుకాదు. లలితకు ఎవ్వరూ లేక పోవడం చేతనే వారింట్లో ఉంటూ ఉన్నది." అన్నాడు.

భువనేశ్వరి కొంచెంసేపు ఆలోచించి - "అదీ నిజమే. కాని మీనాన్న అదోరకం మనిషి. ఎంతమాత్రం ఒప్పుకోడు. వాళ్లతో మాట్లా డనుకూడా మాట్లాడ నివ్వడు," అన్నది.

శేఖరుని మనస్సులోకూడా ఈసందేహంఉన్నది. ఇకనేమీ మాట్లాడ కుండా వెళ్ళిపోయాడు.

దీనితర్వాత ఒక్కనిముషంకూడా అక్కడఉంటానికి అతనికి మనస్సుకొలుపలేదు. రెండుమూడు రోజులు నానావిధాల ఆలోచించి ఒకనాటి సాయంకాలం తల్లి దగ్గరికివచ్చి "నాకిక్కడ బాగా ఉండుట లేదమ్మా! ఇంటికి పోదాము" అన్నాడు.

భువనేశ్వరి వెంటనే ఇష్టపడి "అలాగేపద శేఖర్! నాకూ్కడా ఏమీ బాగా ఉండటంలేదు." అన్నది.

తల్లి కొడుకు లిద్దరూ ఇంటికివచ్చి చూసేవరకు ఇదివరకు మిద్దె మీద వస్తూపోతూఉన్న దోవకు గోడ అడ్డంపెట్టి ఉన్నది. గురుచరణు నితో ఏవిధమైన సంపర్కం ఉంచుకోవడంకానీ, ఆఖరికి మాట్లాడటంకానీ యజమానికి ఇష్టంకాదని ఎవరినీ అడగకుండానే వారుభయులూ తెలుసుకున్నారు.

రాత్రి శేఖరుడు భోజనం చేసేటప్పుడు తల్లి దగ్గరనే ఉన్నది. ఒకటిరెండు మాటలు జరిగినతర్వాత "వాళ్ళ గిరీన్‌బాబుకు లలితను ఇచ్చి పెళ్ళి చేయటానికి మాటలు జరుగుతున్నాయట! ఇలా జరుగుతుందని నేనెప్పుడో అనుకున్నాను." అన్నది భువనేశ్వరి.

"ఎవరు చెప్పారు?" అని శేఖరుడు తల ఎత్తకుండానే అడిగాడు.

"వాళ్ళఅత్త! మధ్యాహ్నం మీనాన్న నిద్రపోయేటప్పుడు ఒకమాటు వెళ్ళివచ్చాను. ఏమి ఏడ్చింది, నాదగ్గర" అని ఒక్కక్షణం ఆగి కళ్ళు రెండూ చెరగుతో అద్దుకొని "అదృష్టం, శేఖర్ అదృష్టం! నొష్టను రాసినరాత ఎవ్వరూ మార్చలేరు. ఎవరి తప్పంటావో చెప్పు? జరిగిందేమో జరిగింది. గిరీన్‌కూడా మంచికుర్రాడే, డబ్బుకూడా ఉన్నది. లలితకేమీ కష్టం ఉండదు!" అని ఊరకున్నది.

శేఖరుడు ఏమీ జవ్వాబివ్వలేదు. తలవంచుకొని అన్నం అటూ

ఇటూ కదుపుతూ ఊరుకున్నాడు. కొంచెంసేపు ఉండి తల్లి వెళ్ళిపోయింది. తర్వాత తానుకూడా లేచి చేతులు కడుక్కొని పక్కమీదికి పోయి పండు కున్నాడు.

మర్నాడు సాయంత్రం షికారుకు పోదామని శేఖరుడు బయలు దేరాడు. అప్పుడు గురుచరణునిముందు ఇంటిలో మామూలు మాదిరిగా టీపార్టీ జరుగుతూఉన్నది. సంభాషణా నవ్వులూ మహాజోరుగా సాగు తున్నవి. ఈకోలాహలం శేఖరుని చెవిని పడగానే రోడ్డుమీద ఆగిపోయి కొంచెంసేపు ఆలోచించాడు. తర్వాత నెమ్మదిగా శబ్దాన్ని అనుసరించి గురుచరణుడు వగైరాలు ఉన్నచోటికి వచ్చి నిలబడ్డాడు. తక్షణం కలవరం ఆగిపోయింది. ఇతనిముఖం కనపడగానే అందరి ముఖభావాలు మారి పోయాయి. శేఖరుడు తిరిగివచ్చాడని లలితకుతప్ప ఇకెవ్వరికీ తెలియదు.

ఇవ్వాళ గిరీంద్రుడుకాక ఇంకొక యువకుడుకూడా ఇక్కడ ఉన్నాడు. అతను విస్మయంతో శేఖరునివంకచూస్తూ ఊరకున్నాడు. గిరీ నుడు ముఖాన్ని కొంచెం గంభీరంగాచేసి గోడవంకచూస్తూ ఉండిపో యాడు. అందరికంటే ఎక్కువగా అరుస్తున్నది, గురుచరణుడు. అతని ముఖం ఒక్కమాటుగా వెల్లపడి పోయింది. లలిత అతని పక్కనే కూర్చుని టీ తయారు చేస్తున్నది. ఒకమాటు ముఖం ఎత్తిచూసి మరల వంచుకున్నది,

శేఖరుడు దగ్గరకువచ్చి టేబిలుమీద తలపెట్టి నమస్కారంచేసి ఒక కుర్చీలో కూర్చుని నవ్వుతూ "ఏమిటీ, అంతా ఒక్కమాటు చల్లబడిందే!" అన్నాడు.

గురుచరణుడు మెల్లగా, బహుశా, ఆశీర్వదించా డనుకుంటాను. కాని ఏమన్నదీ వినపడలేదు. శేఖరుడు వారి మనోభావాన్ని గ్రహించాడు.

నిన్నతాను ఏ బండికి వచ్చిందీ, తల్లికి జబ్బు నయమైన సంగతీ, పడమటి విశేషాలూ, ఇంకా చాలా విషయాలు. అనర్గళంగా చెప్పి చివరకు ఆ అపరిచిత యువకునివంక చూశాడు.

గురుచరణుడు ఇప్పటికి తెప్పరిల్లుకుని కుర్రవాణ్ణి పరిచయం చేశాడు.

"ఇతను మా గిరీనుకు మిత్రుడు, ఒక్కచోటనే ఇల్లు. కలిసే చదువుకున్నారు. చాలామంచివాడు. శ్యాము బజారులో ఉంటున్నా మాతో పరిచయం అయినప్పటినుంచీ, రోజూ ఒక్కమాటయినా వచ్చి పోతూ ఉంటాడు."

"చాలామంచివాడు!" అని శేఖరుడు మనస్సులో అనుకొని "కక్కాయి, అంతా క్షేమమేనా?" అడిగాడు.

గురుచరణుడు జవాబివ్వలేదు. తలవంచుకొన్నాడు. శేఖరుడు లేవ పోతూ ఉండగా - "మధ్య మధ్య వస్తూ ఉండు నాయనా! పూర్తిగా వదిలి పెట్టబోకు - సంగతులన్నీ విన్నావుగా?" అని రోదనస్వరంతో అన్నాడు.

"విన్నాను!" అని శేఖరుడు లోపలికి వెళ్లాడు.

తర్వాత లోపలినుంచి గృహిణి రోదనధ్వని వినిపించింది. బయట కూర్చున్న గురుచరణుడు గుడ్డతో కళ్లు తుడుకో నారంభించాడు. గిరీన్ అపరాధివలె ముఖంపెట్టి కిటికీలోంచి మాట్లాడకుండా బయటకు చూస్తున్నాడు. లలిత అక్కడనుంచి ఎప్పుడో వెళ్లిపోయింది.

కొంచెం సేపయినాక శేఖరుడువంట ఇంట్లోనుండి వరండాలోకి వచ్చాడు. ఆచీకటిలో లలిత తలుపు చాటునుంచి బయటకు వచ్చి నేలమీద కూర్చుని నమస్కరించి, లేచి నిలబడింది. తర్వాత చాలాదగ్గరికి పోయి ఏదో ఆశిస్తున్నట్టుగా అతనివంక చూసి మళ్లీ వెనక్కువచ్చి - "నా ఉత్తరానికి

జవాబివ్వలేదెందుకు" అని మెల్లగా అడిగింది.

"ఏక్కడా? నాకు ఉత్తరం అందనేలేదే - ఏమిరాశావు?"

"చాలాసంగతులు, అవిప్పుడెందుకు పోనివ్వండి. అంతా విన్నారు గదా, ఇప్పుడు నాకేమి ఆజ్ఞాపిస్తారు?"

"నా ఆజ్ఞా! నా ఆజ్ఞతో ఏమవుతుంది?" అని శేఖరుడు విస్మయంతో అడిగాడు. లలిత శంకితమై శేఖరుని ముఖంవంక చూస్తూ - "ఎందుకని?" అని అడిగింది.

"అంతకాక ఏమిటి లలితా? నేను ఎవరిని ఆజ్ఞాపిస్తాను?"

"నన్నే ఇంకెవరిని?"

"నిన్ను మాత్రము ఎందుకు ఆజ్ఞాపిస్తాను? ఒకవేళ ఆజ్ఞాపించినా నువ్వెందుకు వింటావు?"

శేఖరుని కంఠస్వరంలో గాంభీర్యమూ కొంచెము కరుణా కనపడింది. లలిత మనస్సులో చాలాభయపడి, ఇంకోమాటు దగ్గరకు వచ్చి రోదనస్వరంలో - "పోండి, ఇలాంటప్పుడు తమాషా చేయటం నాకు బాగుండదు! మీకాళ్లమీద పడతాను, ఏం చెయ్యమంటారో చెప్పండి. భయంలో నాకు రాత్రిళ్లు నిద్రకూడా పట్టటంలేదు." అన్నది.

"భయమెందుకు?"

"బాగాఉన్నది. భయముండదా! మీరుదగ్గరలేరు, అమ్మదగ్గరలేదు, ఈమధ్యలో మామయ్య ఈపనిచేసి కూర్చున్నాడు. ఇప్పుడు అమ్మ నన్ను ఇంట్లోకి రానివ్వకపోతే?"

శేఖరుడు ఒక్కక్షణకాలం మాట్లాడకుండా ఊరుకున్నాడు. "అవును నిజమే. అమ్మరానివ్వదు. మీమామ ఇతర్ల దగ్గర చాలా డబ్బు తీసుకున్నాడు. ఆసంగతి ఆమెవిన్నది. అంతేకాక మీరిప్పుడు బ్రాహ్మలు. మేము హిందువులం."

ఈసమయంలో అన్నాకాళీ వంటఇంట్లోనుంచి - "ఒదినా, అమ్మ పిలుస్తున్నది." అని కేకవేసింది. లలిత బిగ్గరగా "వస్తున్నాను!" అని తర్వాత గొంతు తగ్గించి "మామ ఏదైనా కానివ్వండి: నేనుమాత్రం మీరేవో అదే. అమ్మ మిమ్మల్ని వదలుకోలేకపోతే నన్నూ వదలుకోలేము. ఇక గిరీన్‌బాబు దగ్గర డబ్బు తీసుకున్న సంగతి ఉన్నది. అదినేను ఇచ్చేస్తాను. ఋణం అన్నాక రెండురోజులకు ఇవ్వండి. రెండు సంవత్సరాలుంకి ఇవ్వండి. తీర్చవలసిందేగా?"

"అంతడబ్బు నీకు ఎక్కడనుంచి వస్తుంది?"

లలిత శేఖరునివంక ఒకమాటుచూసి ఒక్కక్షణం మౌనంగా వహించి "ఏమో, అందరి స్త్రీలకు డబ్బు ఎక్కడనుంచి వస్తుందో నాకూ్కడా అక్కడనుంచే వస్తుంది." అన్నది.

ఇంతవరకు శేఖరుడు లోపల మండిపోతున్నా పైకి తొణకకుండానే మాట్లాడు తున్నాడు. ఇప్పుడు హేళనగా "కాని మామ నిన్ను అమ్మే శాడుగా?" అన్నాడు.

అంధకారంలో శేఖరుని ముఖభావం లలితకు కనిపించలేదు. కాని కంఠస్వరంలో మార్పు కనిపెట్టింది. ఆమెకూడా దృఢస్వరంతో "ఆ సంగతులన్నీ అబద్ధం. మామామవంటిమనిషి ఈ ప్రపంచంలో లేడు. వారిని ఎగతాళి చేయబోకండి: వారి కష్టాలు మీకు తెలియవు. కాని లోకానికంతా తెలుసును." అని ఒక గుటకవేసి కొంచెం సందేహించి, చివరకు "అది కాక వారు డబ్బు తీసుకున్నది నాపెళ్ళి కాకపూర్వమే. నన్ను అమ్మే అధికారం వారికిలేదు. అమ్మను కూడాలేదు. ఆ అధికారం మీఒక్కరికే ఉన్నది. డబివ్వాల్సి వస్తుందని అమ్మదలుచుకుంటే మాత్రం మీరు అమ్మి వేయగలరు!" అని చెప్పి జవాబుకు ఎదురుచూడకుండా తొందరగా వెళ్ళి పోయింది.



ఆరాత్రి చాలా సేపటివరకు శేఖరుడు పిచ్చివానివలె రోడ్లవెంట తిరిగి అప్పుడే ఇంటికి వచ్చి ఆలోచనలో పడ్డాడు - నిన్న మొన్నటి లలిత ఇన్నిమాటలు ఎక్కడనుంచి నేర్చుకున్నది? తన ఎదుటనే సిగ్గువిడిచి ఇలా ఎలా మాట్లాడకలిగింది?

నేటి, లలిత ఆచరణచూసి శేఖరుడు నిజంగా విస్మితుడయాడు. కాని ఈ కోపానికి మూలకారణం ఏమిటో కొంచెం శాంతంగా ఆలోచించి చూచినట్లయితే - కోపం లలితమీద కాదు, తనమీదనేనని - శేఖరునికి స్పష్టంగా తెలిసిపోయేది.

లలితను వదిలి ప్రవాసంలో ఉన్న ఈ కొన్నిమాసాలు శేఖరుడు కల్పనా రాజ్యంలోనే విహరించాడు. కేవలం, కాల్పనిక సుఖదుఃఖాలూ, లాభనష్టాలూ జమాఖర్చుచేసి - తన భవిష్యత్ జీవితం లలితమీద ఎలా ఆధారపడి ఉన్నదీ, ఆమె లేకుండా జీవించటం ఎంత కఠినమైనదీ, ఎంత దుఃఖకరమైనదీ - తేల్చుకున్నాడు. లలిత చిన్నతనం నుంచీ వాళ్ల కుటుంబంలో కలిసిపోయింది. కాని, ఆకుటుంబంలో ఆమెకు ఏమిస్థానమున్నదని అతను ఎప్పుడూ ఆలోచించలేదు. ఆలోచించవలసిన అవసరమూ రాలేదు. లలిత తనకు లభించదు; తల్లిదండ్రులు ఈ వివాహానికి సమ్మతించరు. ఆమె ఎప్పటికైనా ఇతరులసొత్తు అయిపోయేదే; అనే దుశ్చింత శేఖరుని ఎప్పుడూ బాధిస్తూ ఉండేది. అందుచేతనే కలకత్తా వదలబోయే క్రిందట రాత్రి ఆమె మెడలో బలవంతాన దండవేసి ఆదుశ్చింతను అరికట్ట పోయాడు.

ప్రవాసంలో ఉండగా గురుచరణుని మార్పువిని శేఖరుడు వ్యాకు

లున్నదై ఆహర్నిశలు లలితచేతినుంచి పోతుందేమోనని దిగులు పడుతూ ఉండేవాడు. సుఖములోగానీ దుఃఖములోగాని అతను ఈవైపే ఆలోచించేవాడు. ఇవ్వాళ లలిత ఆవైపు గట్టిగా బంధించి అతని ఆలోచనా ప్రవాహాన్ని ఎదురు త్రిప్పింది। అప్పుడు చింత, ముందు లలిత లభించదేమోనని; ఇప్పుడు ఆలోచన లలిత ఇక వదలదేమోనని।

శ్యామబజారు సంబంధం తప్పిపోయింది. వారు అంతకట్నము ఇవ్వటానికి సందేహించారు. శేఖరుని తల్లికికూడా పిల్లనచ్చలేదు. అందుచేత శేఖరుడు ఈసంబంధంనుంచి మాత్రం తప్పించుకున్నాడు. కాని నవీనరాయ్ ఇరవైవేల కట్నంమాట మరచిపోలేదు. ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు.

ఏంచేయాలి? ఆరాత్రి తానుచేసినపని ఇంతగొంతుమీదకు వస్తుందనీ తనకు నిజంగా వివాహమైంది ఏవిధంగానూ ఇది మారటానికి వీల్లేదని లలిత ఇంతగట్టిగా విశ్వసిస్తుందనీ, శేఖరుడు ఊహించికూడా ఉండలేదు. 'జరగవలసిందేమో జరిగిపోయింది. ఇకనీవూ తప్పుకోలేవు నేనూ తప్పుకోలేను' అని ఆరాత్రి శేఖరుడు నోటితో అన్నాడే కాని ఇవ్వాళ ఆలోచించి చూసినట్టుగా ఆనాడు ఆలోచించి చూడలేదు. చూసేశక్తికూడా లేదు బహుశా, సమయంకూడా లేకపోవచ్చును. అప్పుడు నెత్తిమీద చంద్రుడు ఉన్నాడు, వెన్నెల పిండి ఆరబోసినట్టుగా ఉన్నది, మెడలో పూలదండ కదులుతూ ఉన్నది. ప్రేయసి స్పందనవక్షాన్ని తన హృదయానికి హత్తుకొని ఎప్పుడు ప్రథమ ప్రణయానుభూతిని పొందుదామా అనే మోహమున్నది, ప్రియులు అధరామృత మంటారే దాన్ని పొందాలని తీవ్రలాలస ఉన్నది. అప్పుడితనకి కావలసింది స్వార్థం; మంచి చెడులు ఇతనికి తెలియలేదు. అర్థ లోలుపుడైన తండ్రి రుద్రమూర్తి ఇతని కంటికి కను

పించలేదు. తల్లి లలితను ఎలాగూ ప్రేమిస్తున్నది. అమెను ఒప్పించటం ఏమంత కష్టంకాదు. తండ్రికి ఎలాగో ఒకలాగున అన్నచేత చెప్పించి కొంచెం శాంతపరిస్తే కార్యం సానుకూలమవుతుందని భావించాడు. అంతే కాక, అప్పుడు గురుచరణుడు తానీవిధంగా నాశనమయి, ఇతని ఆశకు ఈ విధంగా అడ్డుపడలేదు. ఇప్పుడు విధాతే శేఖరునికి విరుద్ధమయ్యాడు.

నిజానికి శేఖరుడు ఇంతగా ఆలోచించ వలసిందేమీలేదు. తండ్రిని ఒప్పించటం అలావుంచి తల్లిని ఒప్పించటంకూడా అసంభవమని ఇతని పుడు గట్టిగా తెలుసుకున్నాడు. అసలు, తల్లిదండ్రుల దగ్గర ఈసంగతి పెళ్ళపెట్టే మార్గంకూడా లేదు.

శేఖరుడు దీర్ఘనిశ్వాసం విడిచి, ఇంకోమారు అస్ఫుటంగా 'ఏమి చేయాలి?' అని అనుకొన్నాడు. లలితను తను బాగా ఎరుగును. తన చేతిలోనే పెరిగింది. ఒకమాటు, ధర్మమని నమ్మినదానిని ఏవిధంగానూ వదిలిపెట్టదు! శేఖరుని ధర్మపత్నినని ఆమె నమ్మింది; అందుచేతనే, ఇవ్వాళ సంధ్యాంధకారంలో తనదాపుకు వచ్చి ముఖంమీద ముఖంపెట్టి నిలబడింది.

గిరీన్‌తో ఆమె వివాహప్రసంగం జరుగుతూ ఉన్నది, కానిఆమెను ఎవ్వరూ ఒప్పించలేకుండా ఉన్నారు. ఇక ఆమె ఏమాత్రం ఊరుకోదు! అంతా వెల్లడించి తీరుతుంది. శేఖరుని కళ్లూ ముఖమూ ఉత్తప్తమై పోయినవి. నిజమే! తను మాలమార్చటంతో ఊరుకోలేదు. లలితను హృదయానికి హత్తుకొని ముద్దుకూడా పెట్టుకున్నాడు. ఆమె అడ్డుపెట్ట లేదు - తప్పుకాదనే అడ్డుపెట్టలేదు. ఇప్పుడు ఎవరైనా అడిగితే తాను చేసినపనికి ఏమి జవాబిస్తాడు?

తల్లిదండ్రుల ఇష్టము లేకుండా శేఖరుడు లలితను వివాహం చేసు

కోలేనిమాట నిజము; కాని గిరీనుని వివాహం చేసుకోపోవటానికి కారణ మేమిటో లలిత వెల్లడిచేస్తే తను ఇంట్లోగానీ బయటగానీ ముఖం ఎలా చూపిస్తాడు?

## ౧౦

తల్లిదండ్రులను ఒప్పించటము అసంభవని ఎంచి శేఖరుడు లలిత ఆశను పూర్తిగా త్యజించాడు. మొదట కొన్నాళ్లు భయపడేవాడు లలిత ఎప్పుడు వచ్చి కూర్చుంటుందో, ఏనిముషాన వెల్లడిస్తుందో, అంద రికి సంజాయిషీ యిస్తూ తిరగవలెనే! అని. కాని అతన్ని ఎవరూ ఏమీ అడగలేదు. అసలు, సంగతి వెల్లడయిందో లేదో కూడా తెలియలేదు. ఒకరి ఇంటికి ఒకరు రావటం పోవటం లేదు. శేఖరుని గదిముందు ఖాళీ స్థలములోకి పోయి నిలబడితే గురుచరణుని మిద్దె అంతా కనపడుతుంది. ఒకవేళ లలిత కనపడుతుందేమో ననే భయంతో శేఖరుడు కొన్నాళ్లు గదిముందుకూడా నిలబడేవాడుకాడు. కాని ఒకమాసం నిర్విఘ్నంగా గడిచి పోయిన తర్వాత ఒక్క నిట్టూర్పువిడిచి:—"ఆరు నూరకానీయి. ఆడపిల్ల లకు సిగ్గు అనేది ఉంటుంది. వాళ్లు ఇలాంటి సంగతులు వెల్లడించలేరు" అనుకున్నాడు. హృదయము పగిలిపోతున్నా వారు నోరు విప్పరని ఇది వరకు విని ఉన్నాడు. ఇప్పుడది సత్యమని విశ్వసించాడు. వారి దేహంలో ఈదుర్బలత్వాన్ని ప్రసాదించి నందుకు సృష్టికర్త బుద్ధిని ప్రశంసించాడు. కాని అతనికి శాంతిలేదు. ఎందుకు? ఇక భయమేమీ లేదని తెలుసుకున్న ప్పటినుంచి ఇదివరకు ఎన్నడూ లేనిబాధ హృదయంలో కలుగుతున్న దెందుకు? ఉండి ఉండి అతని హృదయాంతరాళము నిరాశతో, వేదనతో ఆశంకతో కంపిస్తున్న దెందుకు? అయితే, లలిత ఇక ఈసంగతి వెల్ల

డించదా? వివాహం అయ్యేటంతవరకూ మౌనంగా ఉంటుందా? ఆమెకు పెళ్లి అయింది, భర్త ఇంటికి కాపురం చేయడానికి పోయింది, అని తలుచుకోగానే అతని లోపలా బయటా అగ్నిజ్వలిస్తున్న దెందుకు?

ఇదివరకు శేఖరుడు సాయంత్రం షికారుకు వెళ్లేవాడుకాడు. గది ముందు పచారుచేసేవాడు. ఇవ్వాళకూడా ఆలానే చేస్తున్నాడు. కాని ఒక్క నాడుకూడా ఆ ఇంటివారెవరూ మిద్దెమీద కనుపించలేదు. అన్నాకాళీ మాత్రం ఒకనాడు ఏదో పనిమీద పైకి వచ్చింది. కాని ఇతన్ని జూడగనే తలవంచుకున్నది. శేఖరుడు ఆపిల్లను పిలుద్దామా, వద్దా అని స్థిరపరచు కోకముందే తుర్రున మాయమైంది. వారు వచ్చేదోవను, గోడ పెట్టి, బంధించటంలో ఉన్న అర్థం కాస్త జ్ఞానంలేని కాళికూడా గ్రహించిందని శేఖరుడు తెలుసుకున్నాడు.

ఇంకోమాసం గడిచింది.

భువనేశ్వరి ఒకనాడు మాటలసందర్భములో - "ఈమధ్యని నువ్వెప్పుడైనా లలితను చూశావా శేఖర్?" అని అడిగింది,

"లేదు, ఎందుకూ?"

"దాదాపు రెండుమాసాలకుగాను మొన్న మిద్దె మీదికి వస్తేపిలిచాను. పిల్లంతా ఏదోవిధంగా మారిపోయింది. జబ్బుపడ్డ దానికి మల్లే ముఖమంతా వాడిపోయింది. చూస్తే ఎంతో వయస్సు మిగిలిన దానిలాగా కనిపించిది. కాని ఎంత గంభీరత - దాన్ని చూసినవారు పద్నానుగు సంవ రాల పిల్ల అని ఎవరు చెప్పరు?" - భువనేశ్వరి కళ్లలో నీరు తిరిగింది. చేత్తో కళ్లు తుడుచుకొని భారీస్వరంతో - "కట్టుకున్న గుడ్డలు మాసిపో యినై, ఇప్పుడు కమ్మల చీరెలు కట్టుతూ ఉన్నది,- నీకు గుడ్డలులేవా తల్లీ?" అని అడిగాను. 'ఉన్నవి' అని చెప్పింది. కాని నాకు నమ్మకం

కలగలేదు. అది ఎప్పుడు కూడా వాళ్ళమామ యిచ్చిన గుడ్డలు కట్టుకుని ఎరగదు. నేనే ఇస్తూ ఉండేదాన్ని. ఈ ఆరుమాసాలనుంచీ నేను ఒక్క పీలికకూడా ఇవ్వలేదు." ఇక ఆమె ఏమీ చెప్పలేకపోయింది చెంగుతో కళ్ళు తుడుచుకో నారంభించింది. ఆమెకు నిజముగా లలితమీద చాలా ప్రేమ.

శేఖరుడు మాట్లాడకుండా ఒకవైపుకు చూస్తూ కూర్చున్నాడు. కొంచెం సేపు ఉండి ఆమె మరల మొదలు పెట్టింది.

"నన్ను తప్ప ఏనాడూ ఎవ్వరినీ ఏమీ అడిగి ఎరగదు. వేళగాని వేళను ఆకలి అయినా ఆ ఇంట్లో ఎవ్వరినీ అడగదు. నన్నుకూడా అడగదు. నాచుట్టూ తిరుగుతూ ఉండేది. నేను దానిముఖంచూడగానే గ్రహించేదాన్ని. ఈసంగతే నాకు ఎప్పుడూ జ్ఞాపకం వస్తూ ఉంటుంది శేఖర్! ఇప్పుడుకూడా అలాగే ముఖం వ్రేలాడవేసుకొని తిరుగుతూ ఉండవచ్చు. కాని అదెవరూ కనిపెట్టరు. ఆఖరికి అడిగినాకూడా అడగదు. లలిత నన్ను తల్లీ అని పిలవటమేకాదు, పిల్లని ప్రేమించినట్టుగా ప్రేమించేది!"

శేఖరుడు సాహసించి తల్లి ముఖముకేసి చూడలేక పోయాడు. తాను చూస్తూ ఉన్న వైపునుంచి దృష్టిమరల్చకుండ "సరే, అమ్మా! దానికి ఏమి అవసరమో పిల్చి ఎందుకు అడగవూ?" అని అన్నాడు.

"ఎందుకు తీసుకొంటుంది? వచ్చేపోయే దోవకూడా మీనాయన బంధించె! నేనుకూడా ఏముఖంతో ఇవ్వబోతాను? మరిది కష్టంలో, ముందూవెనకా ఆలోచించకుండా ఏదో పొరపాటు చేశాడనుకో! దాన్ని మనం సవరించుకొని, మనవాళ్లకు చేసినట్టుగా ఏదో ప్రాయశ్చితం గియశ్చిత్తము చేసి కమ్మవేయడములేదు. ఒక్కమాటే వేరుచేసి పారవేశాడు అదికూడా పీరిపోరు పడలేకనే! ఎప్పుడూ వత్తిడి - ఒకటే ఒత్తిడి! మన

స్సులో ఏవగింపు కలిగిందంటే మానవుడు ఏపని చేయలేడు? అసలు మరిది మంచిపనే చేశాడని నేనంటాను. మనకంటే ఆ గిరీనే వాళ్లకు చాలా మేలొనర్చేవాడు. అతని కిచ్చి పెళ్లిచేస్తే లలిత సుఖపడుతుందని నేను ఘట్టిగా చెప్పగలను, వచ్చేమాసంలోనే పెళ్లి అవుతుందట."

శేఖరుడు చప్పున ముఖము త్రిప్పి - "వచ్చేమాసములోనే అవుతుందా!" అని ప్రశ్నించాడు.

"అలాగే విన్నాను."

శేఖరుడు ఇక ఏమీ అడగలేదు. తల్లి కొంచెంసేపుండి అన్నది.

"వాళ్ళ మామ వంట్లో ఏమీ బాగాలేదని మొన్న లలిత చెప్పింది. బాగా ఎలాఉంటుంది? అసలు వారికి మనశ్శాంతేలేదు. పైగా రోజు ఇంట్లో ఏడుపులూ మొత్తుకోళ్లూ - ఒక్కనిముషము కూడా వారికి ఇంట్లో స్వస్థత ఉండదు!"

శేఖరుడు మాట్లాడకుండా వింటూ ఉన్నాడు. ఏమీ అడగలేదు. కొంచెముసేపు ఉండి తల్లి లేచిపోగానే అతను పక్కమీదికి వెళ్ళి పండుకొని లలితను గురించి ఆలోచించ నారంభించాడు.

వారి ఇంటిముందు గల్లీ చిన్నది. రెండుబళ్లు స్వేచ్ఛగా తప్పుకోవడానికి వీల్లేదు. ఒక బండి బాగా ప్రక్కకు వత్తి నిలబెట్టింది. రెండోది పోవటానికి వీలుండదు. సుమారు పదిరోజులు గడిచినాక శేఖరుడు ఆఫీసు నుంచి బండిమీద వస్తున్నాడు. గురుచరణుని ఇంటిముందు ఇలాంటి ఆటంకమే రావటముచేత బండిఆగింది. శేఖరుడు బండిదిగి కనుక్కుంటే డాక్టరు వచ్చాడని తెలిసింది.

అతను కొన్నిరోజుల క్రిందట తల్లిదగ్గర గురుచరణుని వంట్లో బాగాలేదని విన్నాడు. అదే జ్ఞాపకమువచ్చి ఇంటికి పోకుండా గురుచరణుని ఇంట్లోకి వచ్చాడు.

విన్నసంగతి సత్యమే. గురుచరణుడు నిర్జీవివలె మంచముమీద పండుకొని ఉన్నాడు. లలితాగిరీనులు ఒక్క ప్రక్కన విచారముతో కూర్చుని ఉన్నారు. డాక్టరు ఎదురుగా కుర్చీలో కూర్చుని రోగాన్ని పరీక్షిస్తున్నాడు. గురుచరణుడు అస్ఫుటస్వరంతో "కూర్చో"మని అన్నాడు. లలిత నెత్తిమీదకు ఇంకా కాస్త ముసుగులాక్కొని ముఖం తిప్పుకు కూర్చున్నది.

డాక్టరు ఈపేటలోనివాడే. శేఖరుని ఎరుగును. రోగిని పరీక్షించి మందురాసి శేఖరునివెంట పెట్టుకొని బయటకు వచ్చి కూర్చున్నాడు. గిరీన్ వెనకనేవచ్చి డాక్టరుకు డబ్బు ఇచ్చాడు. డాక్టరుపోయేముందు - "రోగము ఇంకా అసాధ్యస్థితిలో లేదు. ఈసమయములో గాలిమార్పు చాలా అవసరము" అని హెచ్చరించాడు. డాక్టరు వెళ్లిపోగానే ఉభయులూ ఒక్కసారిగా గురుచరణుని గదిలోకి వచ్చారు.

లలిత గిరీనును చేతితో సైగచేసి పిలిచి, కొంచెము ఎడంగా తీసుకుపోయి మెల్లగా ఏదో ఆలోచన చేయనారంభించింది. శేఖరుడు డాక్టరు వదిలిపోయిన కుర్చీలో స్తబ్ధుడై కూర్చుని గురుచరణుని వంక చూడనారంభించాడు. గురుచరణుడు ఇంతకు ముందే గోడవైపుకు తిరిగి పండుకున్నాడు - శేఖరుడు మళ్లీ వచ్చింది ఎరగడు.

కొంచెముసేపు అలానే నిశ్శబ్దముగాకూర్చుని శేఖరుడులేచి బయలుదేరాడు. లలితాగిరీనులు యింకా మాట్లాడుతూనే ఉన్నారు. ఇతన్ని ఎవ్వరూ కూర్చోమనలేదు;మళ్లీవస్తారా అని అడగలేదు.అసలు పలకరించనే లేదు!

ఇవ్వాళ, లలిత తన్ను ఒక కఠినబాధ్యతనుంచి చిరవిముక్తునిచేసిందని శేఖరుడు గట్టిగా తెలుసుకున్నాడు. ఇక అనుమానంలేదు. తను

నిర్భయంగా శ్వాసవిడవవచ్చును. లలిత ఇక తన్ను అంటిపెట్టుకోదు.

ఇంటికి వచ్చి దుస్తులు మారుస్తుంటే అతనికి అదే తలుపుకు వస్తున్నది. అక్కడ చూసిన సంగతులే జ్ఞాపకము వస్తున్నవి. గిరీనే వాళ్లకు పరమమిత్రుడు; ఆతనే వాళ్లందరికీ ఆధారము! అతనే లలితకు భవిష్యదాశ్రయముకూడా! తానేమీకాడు. ఇలాంటి అపత్సమయములో కూడా లలిత నోరు తెరచి తన్ను ఒక్కమాట అడగలేదు!

శేఖరుడు 'ఉఫ్' అని ఒక సోఫాలో కూలబడ్డాడు. లలిత తన్ను చూడగానే ముసుగువేసుకొని ముఖము త్రిప్పుకుంది. తాను పరాయివాడయినట్టు! అపరిచితుడయినట్టు! ఇటు తనకళ్లముందే గిరీన్ను చాటుకు పిలిచి ఎంత పరామర్శచేసింది! ఈవ్యక్తి వెంట నాటకము చూడటానికి పోతానంటే ఒకప్పుడు తాను పోనివ్వలేదు!

ఒకవేళ తనతో ఉన్న గుప్తసంబంధము జ్ఞాపకమువచ్చి, లలిత సిగ్గుతో ఆలా వ్యవహరించి ఉంటుంది, అని శేఖరుడు మనస్సును సరిపెట్టుకోవాలని చూశాడు. కాని అదెలా సంభవము? ఇంతకాండ జరిగినప్పుడు - ఒక్కమాటకూడా, ఇన్నాళ్లీమధ్యని, తన్నడిగి తెలుసుకోవటానికి ప్రయత్నించిందా?

వాకిటదగ్గర తల్లి కంఠస్వరము వినపడింది - "ఎక్కడనాయనా?- ఇంకా కాళ్లూ చేతులూ కడుక్కోలేదా - పొద్దుకూకింది!" అన్నది అశ్చర్యంతో.

శేఖరుడు తొట్రుపాటుతోలేచి కూర్చున్నాడు. తన ముఖము తల్లికి కనపడుతుందేమో ననేభయంతో పక్కకు త్రిప్పుకొని తొందరగా కిందకు దిగిపోయాడు.

ఇన్నాళ్లనుంచీ శేఖరుడు అనేకవిధాలుగా ఆలోచిస్తున్నాడు. కాని ఒక్క విషయం-తిప్పు ఎవరిదనిమాత్రం-అతను ఆలోచించలేదు. అతాపూ రితమైన మాట ఒక్కటికూడా అతను లలితకు నేటివరకూ చెప్పలేదు. లేక చెప్పటానికి లలితకు అవకాశమివ్వలేదు. పెల్లడి అవుతుందేమో-దాన్ని ఏవిధంగానైనా కప్పిపేయాలి-అన్న భయంతో అతను కృంగిపోతు న్నాడు కాని అపరాధమంతా ఒక్క లలితమీదనేవేసి విచారణచేస్తున్నాడు. అతను కోపంతోనూ, ద్వేషంతోనూ, అవమానంతోనూ దగ్ధమైపోతు న్నాడు బహుశా ప్రపంచంలో ఉన్న పురుషులంతా ఇలాగే విచారణచేసి ఇలాగే దగ్ధమైపోతారనుకుంటాను.

ఇలా లపిస్తూ వారంరోజులు గడిపాడు. ఇవ్వాళ సాయంత్రం కూడా నిస్తబ్ధంగా చిన్నగదిలో ఆ అగ్నినే రాజేసి కూర్చున్నాడు. అక స్మాత్తుగా వాకిలిదగ్గర అడుగులచప్పుడు విని తలఎత్తిచూచాడు. అతని హృదయం గంతువేసింది-కాళి చేయిపట్టుకొని లలితగదిలోకి వచ్చి క్రింద తివాసీమీద కూర్చున్నది!

"శేఖరదా! మేమిద్దరమూ మీకు నమస్కరించటానికివచ్చాము-రేపే మేము వెళ్ళిపోతాము!" అన్నది కాళి.

శేఖరుడు మాట్లాడ లేకపోయాడు, చూస్తూ ఊరకున్నాడు.

"మీ పాదాలదగ్గర అనేక తప్పులుచేసిఉంటాము శేఖరదా! అవన్నీ మరచి పొండి!" అన్నది కాళి మళ్లీ.

ఇందులో ఒక్కమాటకూడా కాళిదికాదనీ, చెప్పిన మాటలు వల్లి స్తున్నదనీ శేఖరుడు గ్రహించాడు-"రేపు ఎక్కడికి పోతారు?" అని అడి గాడు.

"ముంగేరు. నాన్నను తీసుకొని మేమంతా గిరీన్‌గారింటికివెళ్తాము.

అక్కడ నయమయినాకూడా మేమిక తిరిగిరాము. కలకత్తా గాలి నాన్నకు సరిపడదని డాక్టరు చెప్పాడు."

"ఇప్పుడు వారికెలా ఉంది?" అని శేఖరుడు అడిగాడు.

"కొంచెము నయమే." అని కాళి చెరగుచాటునుంచి చీరెలు బయటకు తీసిచూపిస్తూ - "పెద్దమ్మ మాకివి కొనిచ్చింది " అన్నది.

లలిత ఇంతసేపూ మాట్లాడలేదు. ఇప్పుడు లేని ఉేదిలుపుద తాళపుచెవి పెట్టి - "అల్మారీ తాళపుచెవి ఇన్నాళ్లనుంచీ నాదగ్గరే ఉన్నది" అని మందహాసముచేసి - "కాని, అందులో డబ్బేమీలేదు - అంతా ఖర్చయింది!" అన్నది.

శేఖరుడు మాట్లాడలేదు.

"పద, ఒదినా! ప్రొద్దుపోతూ ఉంది." అన్నదికాళి.

లలిత సమాధానమేమీ ఇవ్వకముందే శేఖరుడు వ్యాకులపాటుతో - "కాళీ, క్రిందకుపోయి నాకు రెండు తమలపాకులు తెచ్చిపెట్టమ్మా!" అన్నాడు.

లలిత కాళీచెయ్యి గట్టిగా పట్టుకొని - "నువ్వుకూర్చోకాళీ, నేను తెచ్చిస్తాను." అని గబగబా క్రిందకు వెళ్ళిపోయింది. కొంచెము సేపటికి అకులుతెచ్చి కాళికి ఇచ్చింది. కాళి శేఖరునికిచ్చింది. శేఖరుడు ఆకులు చేతపట్టుకొని విస్తుపోయి కూర్చున్నాడు.

"పోతున్నాము, శేఖరదా!" అని కాళి అతని కాళ్లదగ్గర కూర్చుని నమస్కారము చేసింది. లలిత తాను ఉన్నచోటనే కూర్చుని నమస్కారము చేసింది. తర్వాత ఇద్దరూ మెల్లగా బయటకు వెళ్లిపోయారు.

శేఖరుడు తన ఆత్మగౌరవమూ, మంచిచెడ్డలతో పాటు వెలవెలబోయిన ముఖముతో హతబుద్ధునివలె స్తబ్ధుడై కూర్చున్నాడు. లలిత

వచ్చింది; చెప్పవలసిందేమో చెప్పింది; వివాహానికి సెలవుతీసుకొని వెళ్ళిపోయింది. కాని శేఖరుడేమీ మాట్లాడలేక పోయాడు. తాను చెప్పవలసిందేమీ లేనట్టుగా, అప్పుడ్యాకాలము గాస్తా వెళ్ళిపోయాడు! లలిత, కాళిని కోరి వెంటపెట్టుకొస్తుంది. ఊరేసంగము మరల రావటము ఆమెకు ఇష్టము లేదనికూడా శేఖరుడు గ్రహించాడు. అతని శరీరమంతా జ్వలించి పోయింది. తలతిరుగుతున్నట్టయింది. వేగ మంచముమీదకు పోయి పడుకున్నాడు.

౧౧

గురుచరణుని అస్వస్థత. శరీరము మంగేరు జలవాయువులకు కూడా మరల స్వస్థత చెందలేదు. కొంతకాలం జీవన్మృతునివలె గడిపి, తన సుఖదారాన్ని విడిచి గురుచరణుడు ఈ లోకమునుంచి వెళ్ళిపోయాడు. గిరీనుడు నిజంగా అతని చాలా ప్రేమించాడు. ప్రత్యుపదియవరకు తన శక్తికొలది ప్రయత్నించి చూశాడు.

చనిపోయే ముందు గురుచరణుడు గిరీనుచేయి పట్టుకొని గద్గద కంఠంతో ఈ స్నేహ బంధనము ఇంతటితో తెంపవద్దనీ, దీన్ని చుట్టరికం క్రింద మార్చమనీ కోరాడు. తనజన్మ ఈ శుభకార్యానికి విఘ్నమయిందనీ, తానిదికంటితో ఇక్కడ చూడలేక పోయినప్పటికీ పరలోకంలో ఉండైనా చూచేటట్టు చేయవలసినదని ప్రార్థించాడు. గిరీనుడు సంతోషముతో మనఃపూర్తిగా వాగ్దానం చేశాడు.

కలకత్తాలోని గురుచరణుని ఇల్లు యిప్పుడు అద్దెకు యివ్వబడ్డది. అందులోఉన్న అద్దెవాళ్ళను అడిగి భువనేశ్వరి మధ్యమధ్య మంగేరు సంగతులు తెలుసుకుంటూ ఉండేది. గురుచరణుని మరణ వార్తకూడా ఆమెకు తెలిసింది.

తర్వాత కొంత కాలానికి ఈ యింట్లోకూడా గొప్ప దుర్ఘటన ఒకటి ఘటిల్లింది. నవీనరాయి హఠాత్తుగా చనిపోయాడు. భువనేశ్వరి ఈ దుఃఖాన్ని సహించలేక పోయింది. పిచ్చిదానిలాగా అయి కోడలుకు సంసారం అప్పగించి కాశీ వెళ్ళిపోయింది. వచ్చే సంవత్సరం, శేఖరుని వివాహం స్థిరపడగానే వచ్చి వివాహంచేసి పోతానని చెప్పి పోయింది.

సంబంధం నవీనరాయే స్థిరపరచి పోయాడు. అసలు యింతకు పూర్వమే వివాహము జరగవలసింది. వీరి మృత్యువుమూలాన్నే ఒక్క సంవత్సరం ఆగిపోయింది. పిల్ల తరఫువారు ఇక ఎక్కువ రోజులు ఆగరు. అందుచేత విన్నానే వారువచ్చి లగ్నం పెట్టుకు వెళ్ళారు. ఈమాసంలోనే వివాహం. ఇవ్వాళ శేఖరుడు తల్లిని తీసుకు రావటానికి ప్రయాణ సన్నాహాలు చేస్తున్నాడు. అలమారీలోనుంచి దుస్తులవీ తీసి సూటుకేసులో పెట్టబోతూ ఉండగా, చాలాకాలానికి మళ్ళీ లలిత జ్ఞాపకం వచ్చింది. పూర్వం ఈపని లలిత వంతు

గురుచరణుని కుటుంబము ఇక్కడనుంచి వెళ్ళిపోయి మూడు సంవత్సరాలకు ఎక్కువైంది. ఈ మధ్య వారి సంగతులేవీ ఇతనికి తెలియవు. తెలుసుకోవాలని ప్రయత్నించనూలేదు. అసలు కోరికకూడలేదు. లలితమీద ఇతనికి క్రమముగా ద్వేషము ఏర్పడింది. కాని ఇవ్వాళ, లలిత ఎలా ఉన్నదో తెలుసుకోవాలనే కోరిక ఇతనికి తలవని తలంపుగా కలిగింది. ఆమె గిరీన్ సంరక్షణలో ఉంటున్నది. తప్పక సుఖంగా ఉంటుందనికూడా తనకు తెలుసు. అయినా, ఎప్పుడు పెళ్లి అయింది? అతని దగ్గర ఎలా ఉంటున్నది? వీటివివరాలు తెలుసుకోవాలని ఇతనికి కుతూహలము కలిగింది.

గురుచరణుని ఇంట్లో పూర్వము అద్దెకు ఉండేవారు రెండుమూసాలక్రిందట ఇల్లుకాళీచేసి వెళ్లిపోయారు. "చారు తండ్రిని పోయి కను

కుక్కుందాము వారికి గిరీన్ సంగతులు తెలుస్తూ ఉంటవి." అని శేఖరుడు ఒకమాటు అనుకొన్నాడు.

ఒక్కక్షణకాలము పెట్టెలో గుడ్డలు సర్దటముమాని శేఖరుడు శూన్యదృక్కులతో కిటికీలోనుంచి బయటకు చూస్తూ ఈసంగతే ఆలోచిస్తున్నాడు. ఇంతలో దాసిది వాకిట్లోకివచ్చి - "చినబాబుగారూ! ఆయింటి అమ్మగారు మిమ్మల్ని ఒకమాటు పిలుచుకు రమ్మన్నారు." అని అన్నది.

శేఖరుడు దాసివానివంక చూస్తూ - "ఏయింటావిడ?" అని ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

దాసీచేతితో గురుచరణుని ఇల్లు చూపించి - "ఆయింటి అమ్మగారండీ; చినబాబుగారూ. వారింతా రాత్రి ఏడ్చారుగా!" అన్నది.

"పద. వస్తాను." అని శేఖరుడు వెనువెంటనే దిగిపోయాడు.

అప్పటికి పేళచాలా మిగిలింది. శేఖరుడు ఇంట్లో అడుగు పెట్టగానే హృదయవిదారకమైన ఆక్రందనధ్వనులు చెలరేగినవి. శేఖరుడు విధవవేషములో ఉన్న గురుచరణుని భార్యపట్టుకుపోయి. నేలమీదకూర్చుని నిశ్శబ్దంగా కళ్లు తుడుచుకోసాగాడు. ఇతను దుఃఖించేది ఒక్క గురుచరణుని కోసమేకాదు. పితృశోకముకూడా కలిసి ఉన్నది.

పొద్దుకుంకగానే లలిత వచ్చి దీపము వెలిగించి శేఖరునకు దూరముగా ఉండే నమస్కరించి, ఒక్కక్షణము ఎదురుచూసి నెమ్మదిగా వెళ్లిపోయింది. పదిహేడుసంవత్సరాల ప్రాయముగల పరస్త్రీవంక శేఖరుడు కన్నెత్తి చూడలేకపోయాడు. పిలిచి. మాట్లాడలేక పోయాడు. అయినా అతను వారగంట చూసినంతలో, లలిత చాలా పెరిగినదనీ, బొత్తిగా కృశించిపోయిందనీ గ్రహించాడు.

ఏడుపులూ ఓదార్పులూ అయిన తర్వాత గురుచరణుని భార్య

చెప్పిన దానికి సారాంశమిది: ఈ ఇల్లు విక్రయించి ముంగేరులో అల్లుని వద్ద ఉండవలెనని ఆమె కోరిక. శేఖరుని తండ్రికి చాలా కాలమునుంచి ఈ ఇల్లు కొనాలని ఉన్నది. ఒకరు అడిగిన ధరకు వీరికే ఇస్తుంది. ఈ ఇల్లు వీరుకొంటే ఒకవిధముగా సొంతవారి దగ్గర ఉన్నట్లే ఉంటుంది. ముందు ఎప్పుడైనా ఈ దేశము వస్తే ఈ ఇంట్లో ఒకటి రెండు రోజులు ఉండి పోవచ్చును.

శేఖరుడు, తల్లిని కనుక్కొని తనచేతనైన సహాయము చేస్తానని చెప్పినమీదట ఆమె కళ్లు తుడుచుకొని - "అక్కయ్య ఇప్పట్లో రాదా శేఖర్?" అని అడిగింది.

ఇవ్వాళ రాత్రికే ఆమెను తీసుకురావటానికి పోతున్నానని శేఖరుడు చెప్పాడు. తర్వాత ఒక్కటొక్కటిగా చాలా సంగతులు అడిగి తెలుసు కొన్నది: శేఖరుని పెళ్లి ఎప్పుడు? ఎక్కడ? కట్నము ఎన్నివేలు? ఎంత నగకట్టు? నవీనరాయ్ ఎలా చనిపోయాడు? - ఈ ప్రశ్నలన్నిటికీ శేఖరుడు జవాబులు చెప్పాడు.

శేఖరుడు సెలవు తీసుకునేసరికి వెన్నెల వచ్చింది. ఈసమయము లోనే గిరీనుడు పైనుంచి దిగి, బహుశ వాళ్ళ అక్కయ్య ఇంటికికాబోలు, వెళ్ళిపోయాడు.

గురుచరణుని భార్య— "మా అల్లునితో నీకు పరిచయం లేదా శేఖరనాథ్? అంత మంచి కుర్రవాడు ప్రపంచంలో లేడు" అని అన్నది.

అందులో ఏమీ సందేహము లేదనీ, పరిచయం కూడా ఉన్నదనీ చెప్పి శేఖరుడు తొందరగా వరాండాలోకి వచ్చి లలితను చూసి చప్పున ఆగిపోయాడు.

లలిత ఇంతవరకూ తలుపు చాటున నిలబడి ఉన్నది. ఇప్పుడు

బయటకు వచ్చి—"అమ్మను తీసుకురావటానికి ఇవ్వాళే పోతున్నారా?" అని అడిగింది.

"ఆఁ!" అన్నాడు శేఖరుడు.

"అమ్మ చాలా దిగులుపడిందా?"

"ఆఁ. దాదాపు పిచ్చిదానిలాగా అయిపోయింది."

"మీవంట్లో ఎలా ఉన్నది?"

"బాగానే ఉన్నది!" అని శేఖరుడు ప్రాణాలు తప్పించుకొని గబ గబ బయటపడ్డాడు. రోడ్డుమీదకు వచ్చి, అతను సిగ్గుతోనూ, ఏవగింపు తోనూ ఆపాదమస్తకం కంపించిపోయాడు. లలిత ప్రక్కన నిలబడటం చేత తన దేహం అపవిత్రమైనదని ఎంచసాగాడు. ఇంటికి వచ్చి ఏదోవిధ ముగా పెట్టెను సర్ది మూసివేశాడు. ఇంకా బండికి వేళ ఉన్నదని తెలుసు కొని, ప్రక్కమీద పండుకొని లలితవిషాక్త స్మృతిని కాల్చి భస్మం చేయా లని శపథం చేసి, హృదయంలో ఘృణాదావానలాన్ని ప్రజ్వరిల్ల జేశాడు. ఆదహనయాతనలో శేఖరుడు లలితను అనకూడని మాటలన్నీ అన్నాడు. ఆఖరుకు, కులట అనటానికి కూడా సంకోచించలేదు. ఇంతకు ముందు గురుచరణుని భార్య మాటల సందర్భంలో—ఇది అంత సంతోషంతో చేసిన పెళ్ళి కాదు, చివరిఘడియవరకూ, ఇలా అవుతుందని ఎవరూ అను కోలేదు. లేకపోతే మీ అందరికీ కబురు చేయమని లలిత చెప్పనేచెప్పింది —అని వెళ్ళబెట్టింది. లలిత ఈ స్పర్ధ చూసి శేఖరుని హృదయాగ్ని కొడిగట్టింది.

## ౧౨

శేఖరుడు తల్లిని తీసుకొని తిరిగి వచ్చాడు. వివాహం ఇంకా పది పన్నెండు రోజులున్నది.

రెండు మూడు రోజులున్న తర్వాత ఒకనాడు శేఖరుడు ఏదో పని ఉండి తల్లిదగ్గరకు వచ్చాడు. లలిత అక్కడ తలపంచుకు కూర్చుని ఏదో పనిచేస్తున్నది. శేఖరుడు తొట్రుపడ్డాడు.

"ఎందుకు వచ్చావురా?" అని తల్లి అడిగింది.

శేఖరుడు ఎందుకువచ్చినదీ మరచిపోయి—"కాదు, ఇప్పుడుకాదు!" అని చకచక బయటకువెళ్ళి పోయాడు. లలిత ముఖం ఇతనికి కనపడ లేదు. కాని చేతులమీద దృష్టి పడింది. చేతులను గాజులు తప్ప ఇకేమీ లేవు. శేఖరుడు క్రూరంగా నవ్వి 'ఇదో రకం వేషం!' అని అనుకొన్నాడు. గిరీనుడు భాగ్యవంతుడని ఇతనికి తెలుసును. అతని భార్య ఇలా నిరాభర ణగా ఉండటానికి కారణమేమిటో ఇతనికి బోధపడలేదు.

ఆనాడే, సాయంకాలం ఏదో అవసరపు పనిమీద శేఖరుడు క్రిందకు దిగివస్తున్నాడు. లలిత పైకి ఎక్కివస్తూ ఇతన్నిచూచి ప్రక్కకు వత్తుకొని నిలబడింది. కాని, శేఖరుడు దగ్గరకు రాగానే చాలా సంకోచముతో— "మీతో ఒకమాట చెప్పాలి" అని అన్నది.

శేఖరుడు టక్కున ఆగి—"ఎవరికి! నాకా?" అన్నాడు.

"ఔను, మీకే!" అన్నది లలిత మెల్లగా.

"నాతో నీకేమిమాట!" అని శేఖరుడు గబ గబా క్రిందకు దిగి పోయాడు.

లలిత కొంచంసేపు అక్కడే చేష్టలుడిగినదానివలె నిలబడి, చిన్ని నిట్టూర్పు విడిచి నెమ్మదిగా వెళ్లిపోయింది.

మర్నాడు ఉదయం, శేఖరుడు వరండాలో కూర్చుని ఆనాటి పత్రిక చదువుతూ ఉండగా గిరీనుడు వచ్చాడు. అతని రాక శేఖరునికి ఆశ్చర్యం కలిగించింది. గిరీన్ నమస్కరించి, దగ్గరలో ఉన్న కుర్చీని లాక్కుని కూర్చున్నాడు. శేఖరుడు ప్రతి నమస్కారంచేసి చేతిలోని పత్రిక ఒక ప్రక్కనపెట్టి గిరీనుని వంక జిజ్ఞాసాదృక్కులతో చూస్తూ ఉండి పోయాడు. ఒకరినొకరు ఇద్దరూ ఎరుగుదురు. కాని ఎప్పుడూ మాట్లాడుకోలేదు. మాట్లాడాలని ఇద్దరిలో ఎవరుకూడా, నేటివరకు కుతూహలం చూపించలేదు.

గిరీన్ ఎత్తుకోవటమే వ్యవహార విషయం ఎత్తుకున్నాడు.

"ఒక అవసరం ఉండి మిమ్మల్ని ఇబ్బంది పెట్టటానికి వచ్చాను. మా అత్తగారి ఉద్దేశం మీరు వినే ఉన్నారు—ఈ ఇల్లు మీకే అమ్మాలని ఆమె కోరిక. త్వరలో ఏదో ఒక సంగతి తేల్చుకుంటే ఈ మాసంలోనే ముంగేరు వెళ్ళిపోతాము. ఈ సంగతి చెప్పటానికే నన్ను మీ వద్దకు పంపారు."

గిరీన్ను జూడగానే శేఖరుని హృదయంలో తుపాను రేగింది. ఈ మాటలు అతనికేమీ బాగా ఉండలేదు.

"మంచి సంగతే. కాని, నాన్న చనిపోయినప్పటినుంచీ అన్నయ్యదే పెత్తనం. వారికే చెప్పటం మంచింది" అన్నాడు అప్రసన్నముఖంతో.

"ఆ సంగతి నాకూ తెలుసును. కాని వారికి మీరు చెప్పటమే మంచిది" అని గిరీనుడు మందహాసం చేశాడు.

"మీరు చెప్పినా చాలును. ఆ తరఫున సంరక్షకులు ఇప్పుడు మీరేగా!" అన్నాడు శేఖరుడు పూర్వ ధోరణిలోనే.

"నేను చెప్పవలసిన అవసరం ఉంటే చెప్పుతాను. కాని ఈ పని

మీరు తలుచుకుంటే సులుపుగా అవుతుందని చెల్లి చెప్పింది.

శేఖరుడు ఇంతసేపటినుంచి జాలీసుకు అనుకునే మాట్లాడుతున్నాడు. ఇప్పుడు తిన్నగా లేచి కూర్చుని—"ఎవరూ చెప్పింది?" అని అడిగాడు.

"చెల్లి—లలిత చెప్పింది."

శేఖరుడు విస్మయముతో హతబుద్ధుడయాడు. తర్వాత గిరీన్ చెప్పిన మాటలు ఒక్కటికూడా అతని చెవి చూరలేదు. కొంచెముసేపు విహ్వల దృష్టితో గిరీన్‌వంక చూసి—"క్షమించండి. గిరీన్‌బాబుగారూ! మీరు లలితను వివాహం చేసుకోలేదా?" అని అడిగాడు.

గిరీనుడు నాలుక కొరుక్కొని—"చిత్తం, లేదు.—వారి నందరినీ మీరు ఎరుగుదురు కదా—కాలిని—" అన్నాడు. ఇంకా పూర్తి చేయలేదు.

"కాని, అలాంటి మాటలు జరగలేదే?"

"నిజమే, అలాంటి మాటలు జరుగలేదు. గురుచరణబాబుకు నేను ఎక్కడా పెళ్ళి చేసుకోనని మాట యిచ్చాను. వారు చనిపోయిన తర్వాత లలిత నాకు సంగతులన్నీ చెప్పింది. ఎవరికీ తెలియకపోయినప్పటికీ ఆమె వివాహం జరిగిందట! భర్త జీవించి ఉన్నాడట. ఈ సంగతులు ఇతరులెవ్వరూ విశ్వసించేవారు కారు; కాని, నేను మాత్రం విశ్వసించాను. అదీ కాక, స్త్రీలకు ఒకమాటుకంటె ఎక్కువసార్లు వివాహం జరుగదు.—అదేమిటి?"

శేఖరుని కళ్లు అశ్రువులతో నిండినవి. ఇప్పుడు ఆ భాష్పాలే ధారగా కళ్ళవెంట, గిరీనుని ఎదుటనే, బొట బొట కారినవి కాని ఇతనికి ఈ సంగతే తెలియదు. పురుషుల ఎదుట పురుషుని ఈ దుర్బలత్వము వెల్లడి కావటం లజ్జాకరమని ఇతనికి తోచనుకూడా లేదు.

గిరీనుడు మాట్లాడకుండా చూస్తూ ఉన్నాడు. అతని మనస్సులో

ఉన్న సందేహము ఇప్పుడు తీరిపోయింది—లలిత భర్తను కనిపెట్టాడు!
శేఖరుడు కళ్ళు తుడుచుకొని—"మీరు లలితను ప్రేమించేవారు కాదూ?"
అని అడిగాడు.

గిరీన్ ముఖంమీద ప్రచ్ఛన్న వేదన ఛాయగా గోచరించింది. కాని
మరుక్షణానే మందహాసం చేసి—"ఈ ప్రశ్నకు జవాబివ్వటం అనవసరం!
ప్రేమ ఎంతన్నా ఉండనివ్వండి, పెరిగి ఉండి ఇతర్ల భార్యను ఎవ్వరూ
వివాహం చేసికోరు. పోనివ్వండి, పూజ్యులను నేను విమర్శించతలచలేదు"
అని లేచి ఇంకోమాటు నవ్వి—"పోతున్నాను. మళ్ళీ కనుపడతాను" అని
నమస్కరించి వెళ్ళిపోయాడు.

శేఖరుడు గిరీన్ని మొదటినుంచీ ద్వేషిస్తూ వచ్చాడు. ఈ ద్వేషం
రాను రాను ఏవగింపులోకి కూడా దిగింది. కాని నేడు అతను వెళ్ళిపో
గానే, శేఖరుడు లేచి క్రింద కూర్చుని తల నేలకు అనించి, ఆ అపరిచిత
బ్రాహ్మయువకుని ఉద్దేశించి అనేకసార్లు నమస్కరించాడు. మానవుడు
రెండో కంటికి తెలియకుండా ఎంత స్వార్థత్యాగం చేయగలడో, ఎటువంటి
కఠోర వాగ్దానాలనైనా నవ్వుముఖంతో ఎలా చెల్లించగలడో, ఇవ్వాళ, శేఖ
రుడు మొట్టమొదట తెలుసుకున్నాడు

మధ్యాహ్నము భువనేశ్వరి తన గదిలో చాపమీద కూర్చుని లలిత
తోడ్పాటుతో కొత్త గుడ్డలు వరుసలు పెడుతూ ఉన్నది. శేఖరుడు గది
లోనికి వచ్చి శయ్యమీద కూర్చున్నాడు. ఇవ్వాళ ఇతను లలితను చూసి
వ్యాకులపడి పరుగెత్తలేదు.

"ఎందుకు వచ్చావోయ్?" అని ప్రశ్నించింది తల్లి.

శేఖరుడు జవాబివ్వలేదు. కొంచెంసేపు మాట్లాడకుండా గుడ్డల
పొత్తులవంక చూసి—"ఏంచేస్తున్నావమ్మా?" అన్నాడు.

కొత్తగుడ్డలు ఎవరెవరికివ్వాలో లెఖ్ఖపెట్టి చూస్తున్నాను. బహుశా, ఇంకా కొనాల్సి ఉంటుందనుకొంటాను— ఏమి తల్లీ?" అని లలితను అడిగింది.

లలిత ఔనన్నట్టు తల ఊపింది.

"నేను పెళ్ళిచేసుకోకపోతేనో అమ్మా?" అని శేఖరుడు నవ్వుతూ అడిగాడు.

భువనేశ్వరికూడా నవ్వుతూ—"ఇదిపరకు నీవు చేసినవాటికంటే ఇది ఏమంత గొప్ప పని!" అని అన్నది.

"ఇప్పుడుకూడా అలాంటి పరిస్థితులే వచ్చాయమ్మా!" అని శేఖరుడు మళ్ళీ నవ్వుతూ అన్నాడు.

"అదేమిటిరా? అలాంటి అపభ్రంశపు మాటలు నోట రానీయకు!" అన్నది తల్లి గంభీరంగా.

"ఇన్నాళ్ళనుంచీ నోట రానివ్వలేదమ్మా! ఇక రానివ్వకపోతే కుదరదు—పాపం చుట్టుకొంటుంది."

భువనేశ్వరికి అర్థం కాక శంకితదృష్టితో చూస్తూ ఊరకున్నది.

"నీ ఈ కుఱ్ఱవాని తప్పులు చాలాసార్లు క్షమిస్తూ వచ్చావు. ఈసారి కూడా క్షమించు అమ్మా! నిజంగా, నేను ఈపెళ్ళి చేసుకోను."

కొడుకు మాటలు, ముఖభంగిమా చూసేసరికి భువనేశ్వరికి ఉద్విగ్నత కలిగింది. కాని ఆ భావాన్ని అణచి—"సరే చేసుకోవద్దులే, పో ఇక్కడనుంచి. నన్ను వేధించబోకు శేఖర్! నాకు బోలెడు పనులున్నవి!" అన్నది చీకాకుతో.

శేఖరుడు నవ్వాలని వ్యర్థప్రయత్నం చేసి, పొడి గొంతుకతో— "కాదమ్మా! నీకు నిజం చెప్తున్నాను. నే నీ పెళ్ళి చేసుకోను" అన్నాడు.

"ఎందుకని? ఇదేం పిల్లల ఆటా?"

"పిల్లల ఆట కాదు కనుకనే చెప్తున్నానమ్మా!"

భువనేశ్వరికి ఈమాటు నిజంగానే భయం కలిగింది.

"ఏం వచ్చింది? నాకు స్పష్టంగాచెప్పు శేఖర్! నాకీ గందరగోళం మాట లేమీ బాగుండలేదు" అన్నది.

"ఇవ్వాళ కాదమ్మా, ఇంకోరోజున విందువుగాని."

"ఇంకోరోజున చెప్పుతావా?" అని భువనేశ్వరి చేతులోని గుడ్డలు అవతల పారవేసి—"అయితే నన్ను ఇవ్వాళే కాశీకి పంపు. ఈ సంసారంలో నేను ఒక్క క్షణంకూడా ఉండను" అన్నది.

శేఖరుడు తలవంచుకు కూర్చున్నాడు.

భువనేశ్వరి అస్థిర చిత్తంతో—"లలితకూడా వెంట వస్తానంటున్నది. దాన్నికూడా తీసుకుపోయేటట్టు చూడాలి," అన్నది.

ఈమాటు శేఖరుడు తలఎత్తి నవ్వాడు.

"నువ్వు తీసుకుపోదలచుకుంటే ఇంకా చూసేదేముంటుంది? నీ ఆజ్ఞను అది ఎలా మీరుతుందమ్మా!"

శేఖరుని నవ్వు ముఖంచూసి భువనేశ్వరికి కొంచెం ఆశ కలిగింది. ఒకమాటు లలితవంకచూసి—"విన్నావా తల్లీ, వాడి మాటలు? నేను తలచుకొంటే చాలు, నా ఇష్టం వచ్చినచోటికి నిన్ను తీసుకువెళ్ళగలనని వాడు అనుకొంటున్నాడు—వాళ్ల అత్త అనుమతి తీసుకోవద్దా?" అని అన్నది.

లలిత మాట్లాడలేదు. శేఖరుని ఓరగాచూసి కుంగిపోతూ ఉన్నది.

"ఆమెకు చెప్పదలచుకొంటే చెప్పు. అది నీ ఇష్టం. కాని అసలు నీమాట ప్రకారమే జరుగుతుందమ్మా! ఈ సంగతి నాకూ తెలుసు. నువ్వు తీసుకువెళ్లదలచుకొన్న మనిషికీ తెలుసు. లలిత నీ కోడలు!" అని శేఖరుడు తలవంచుకు కూర్చున్నాడు.

భువనేశ్వరి విస్మయంతో స్తంభితురాలయింది. తల్లినా కొడుకు ఇలా పరిహసించటం! అతనివంక కోపంగా చూస్తూ—"ఏమన్నావు? లలిత నాకేమవుతుంది?" అని అడిగింది.

శేఖరుడు తల ఎత్తలేకపోయాడు. కాని జవాబిచ్చాడు.

"చెప్పితినిగా అమ్మా! ఇవ్వాళకాదు నాలుగు సంవత్సరాలకు ఎక్కువైంది. అంతా నేను చెప్పలేను. దానినే అడుగు చెప్పుతుంది." అని తలఎత్తి చూచాడు. లలితచెరగు మెడకు చుట్టుకొని భువనేశ్వరికి నమస్కరించ బోతున్నది. శేఖరుడుకూడా లేచివచ్చి ప్రక్కన నిలబడ్డాడు. ఉభయులూ ఒక్కమాటుగా తల్లికాళ్లవద్ద కూర్చుని నమస్కరించారు— తర్వాత శేఖరుడు వెళ్లిపోయాడు.

భువనేశ్వరి కళ్ళవెంట ఆనందాశ్రువులు కారసాగినవి. నిజంగా ఆమె లలితను చాలా ప్రేమిస్తున్నది. పెట్టెతెరచి నగలన్నీ బయటకు తీసి ఒక్కటొక్కటిగా అలంకరిస్తూ క్రమంగా సంగతులన్నీ తెలుసుకున్నది. అన్నీవిన్న తర్వాత—"అందుకనేనా గిరీన్ కాళిని పెళ్లిచేసుకున్నది?" అని అడిగింది.

"ఔనమ్మా, అందుకే. గిరీన్‌బాబులాంటి మనుష్యులు ఈ ప్రపంచంలో ఉన్నారో లేదో నాకు తెలియదు. నేను వారితో, నాకు వివాహమైనది. భర్త నన్ను స్వీకరించనీ స్వీకరించకపోనీ, బ్రతికే ఉన్నాడు; అని

చెప్పగానే వారు విశ్వసించారు."

భువనేశ్వరి లలిత తలను స్పృశిస్తూ, "ఉంచట మేమిటి తల్లీ! జన్మ జన్మాలా దీర్ఘజీవి అయి ఉంటావని నేను ఆశీర్వదిస్తున్నాను— కొంచెంసేపు కూర్చో తల్లీ, నేను పోయి పెళ్ళికూతురు మారింపని అవినాశునితో చెప్పి వస్తాను" అని పెద్దకొడుకు గది వైపుకు వెళ్ళి పోయింది.

# నవశక్తి ప్రచురణాలు

1 మాస్కో తిరుగుబాటు
కామ్రేడ్ తుమ్మల వెంకటరామయ్య 0—1—0

2 నిర్మాణ సమస్యలు
కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య 0—1—0

3 దేవదాస్ (నవల)
శరత్‌బాబు రచితం, చక్రపాణి అనువాదం 0—6—0

4 కమ్యూనిస్టులు కోరేదేమిటి?
కామ్రేడ్ మారిస్ థోరే 0—1—0

5 పాలస్టయిన్
కామ్రేడ్ తుమ్మల వెంకటరామయ్య 0—4—0

6 పరిణీత (నవల)
శరత్‌బాబు రచితం, చక్రపాణి అనువాదం 0—4—0

నవశక్తి కార్యాలయం
బెజవాడ.

ఎక్కువవుతున్నాయి. వాటిమీద వాళ్ళకి ప్రేమలేదు. కాని అవి కొందరికి సంతోషాన్నిస్తున్నాయనీ, ఆ గొప్పతనం తమకీ లేకపోయిందనీ, ఆవేదన. నా ప్రాణాలుకూడా యీ దిగులుకి సాయపడ్డాయా? అభివృద్ధికే తోడ్పడ్డాయా?

ఈ బాధలులేక simple జీవితాన్ని గడిపే పూర్వ పద్ధతుల వాళ్ళనీ పల్లెటూరివాళ్ళనీ, కూలివాళ్ళని చూసి, వాళ్ళలో ఏమన్నా ఇంతకన్న శాంతీ గొప్పతనమూ కనబడతాయేమోనని వెతికితే, వాళ్ళు మొట్టజడులు. చాలామంది వాళ్ళలో ఏ "ప్యూరిటానిటీ" adjustment లేని నిర్జీవులు. వాళ్ళ గొప్ప! ఆ జీవితమే సుఖమా! స్వల్పవాంఛలతో తృప్తిపడి నిద్రగా గడిపే జీవితాలే నయమా? అట్లా ఐతే పశువులూ అంతేనా వాళ్ళ superior beings అన్నమాట.

కాని యీ నాగరికుల అభివృద్ధిమార్గాన్ని చూస్తే యీ రాళ్ళూ, పక్షులూ చాలా ఆనందమయము అనిపిస్తుంది. వింతనటన! ఎన్ని అబద్ధాలు ఎంత అల్పత్వం! నాకున్నట్లా చస్తేనావు, ముగుగు కాలవకీ, పొలాల్లోపారే పంటకాలవకీ వున్న భేదం కనపడుతుంది. ఒకరికంటె ఒకరు యిళ్ళు, నగలు, నటాలు, వస్త్రాలు కీర్తి గొప్పతనం చూపుకోడమూ, ఏమీ ఆనందమివ్వని కోరికలకై శ్రమపడడమూ, ఏదో మిస్ ఐనట్టు పరుగులెత్తడం. ఇంతకన్న ఈ నిరుత్సాహమే నయమేమో!

"మోటార్ స్పీడు చూపించు" అన్నాడు ఆ భర్త. భార్య నవ్వి "అబ్బో! యీ కాస్తకే భయం! ఏమీ భయంలేదు. అంతమాత్రం తెలుసు" అంది. నూతన స్త్రీ! నిజమే, వేషమూ సాధారణమైతేనేం? నూతన స్వతంత్ర వాయువుల్ని పీల్చిన స్త్రీ. పురుషుడు ఇస్తానన్నే సహాయాన్ని అంగీకరించడం అవమానము, ఆత్మగౌరవానికి లోపమనుకనే స్త్రీ. కాని అతనిలో అనాది పురుష అహంభావం గాయపడ్డది. ఎట్లా తన పరిస్థితి నిలుపుకోడం? అధికారంతో మళ్ళీ ప్రతిష్ఠించుకోడం?

"ఆ! అట్లాగే అంటావు. నోరు పూర్తిగా? నేను ఎన్నిసార్లు ఇట్లాంటి అపాయాల్ని తప్పించుకోలేదు? మోటార్లకీ, బళ్ళకీ, సందున పైకిలు తొక్కితే తెలుస్తుంది" అని అసందర్భంగా మాట్లాడి

స్త్రీ లనుగమించలేని సపనాలకి (లేక గొందులకి) వెళ్ళిపోయి నిల బెట్టుకున్నాడు గౌరవం.

భార్యని షికారు తీసికెళ్ళాడు, చూపించాడు, తీసికెళుతున్నాడు భద్రంగా.

ఈ restlsssness వల్ల విద్యాస్వేచ్ఛలకైన ఆరాటంవల్ల పూర్వపు స్త్రీలు నెమ్మదిగా కదలకండా పొందగలిగిన ఆనందాన్ని, శాంతిని, నూతన స్త్రీలు వొదులుకుంటున్నారేమో? పిల్లల గంతులు, చిన్న మాటలు, దోస్త్రీ పాములు, బంధువులు, తెల్లారకట్ట పాటలు. పురుషులూ అంతే! టీచరుపని చేసుకోక యీ కధలు వ్రాయడ మెందుకు? ఈ కొత్తనీచపు నాగరికతలోనించి, యీ బాధకరమైన అశాంతిలోనించి, కొత్త విశాలత్వాన్ని, విజ్ఞానాన్ని ఆనందాన్ని పొందే type evolve అవుతుందా? ఈ పల్లెటూరిజనులు, యీ పట్టణపు నాగరికతా నీచత్వాలలోకి, విశ్వతాలలోకి మారారు. ఈ మార్పు ఉన్నతపరిణామమా? తరవాత s[illegible] ఎక్కడ? తిరిగీ అది జీవితంలో శాంతినీ, శాంతంగా సుందరంగా అనుభవించే శక్తినీ తెచ్చుకోడమే నేమో!

From calm to storm and through storm to a higher calm

గ్రామఫోను "ప్రేమనికుంజమే ఆవో" అని పాడుతోంది. హిందీపాటల్లో మొదలుపెట్టి ఆ వరసలలో ఆ మాటల్నే తెలుగులో వ్రాసిన ప్రస్తుతపు పాటల్లో ఎక్కడచూసినా యీ ప్రేమ అనే మాట అమితంగా వాడుతున్నారు. ప్రేమలోకం, ప్రేమమందిరం, ప్రేమమురళి, ప్రేమహృదయం, హృదయప్రేమ, ప్రేమప్రియుడు, యిట్లా. ఇట్లాంటి గోల వ్రాత ప్రారంభించిన పాపం నేనే చేశానేమో చాలా! కాని మాటలెట్లా వుపయోగించినా వాటివెనక ఏదో ఒక సంగతి నిశ్చితంగా చెప్పాలనేవేదన వుందినాకు. ఈ పాటల్లో యింకా కధలలోను గీతాలలోనూ, మాటలమీద ప్రేమ ఎక్కువగా కనపడుతుంది. ముఖ్యం ప్రేమమాటలమీద.

అందువల్లనే యీ పల్లెటూరి స్త్రీల fashions వలె యీ

స్త్రీ లనుగమించలేని సదనాలకి (లేక గొందులకి) వెళ్ళిపోయి నిల పెట్టుకున్నాడు గౌరవం.

భార్యని షికారు తీసికెళ్ళాడు, చూపించాడు, తీసికెడుతు న్నాడు భద్రంగా.

ఈ restlsssness వల్ల విద్యాస్వేచ్ఛలకైన ఆరాటంవల్ల పూర్వపు స్త్రీలు నెమ్మదిగా కదలకుండా పొందగలిగిన ఆనందాన్ని, శాంతిని, నూతన స్త్రీలు పోగొట్టుకుంటున్నారేమో? పిల్లల గంతులు, చిన్న మాటలు, దొడ్లో పాదులు, బంధువులు, తెల్లారకట్ట పాటలు. పురుషులూ అంతే! టీచరుపని చేసుకోక యీ కథలు వ్రాయడమెందుకు? ఈ కొత్తనీచపు నాగరికతలోనించి, యీ బాధకరమైన అశాంతిలో నించి, కొత్త విశాలత్వాన్ని, విజ్ఞానాన్ని ఆనందాన్ని పొందే type evolve అవుతుందా? ఈ పల్లెటూరిజనులు, యీ పట్టణపు నాగరికతా నీచత్వాలలోకి, [illegible]త్వాలలోకి మారారు. ఈ మార్పు ఉన్నతపరిణామమా? తరవాత s[illegible] ఎక్కడ? తిరిగీ అది జీవితంలో శాంతినీ, శాంతంగా సుందరంగా అనుభవించే శక్తినీ తెచ్చుకో దమేనేమో!

From calm to storm and through storm to a higher calm

గ్రామఫోను "ప్రేమనికుంజమే ఆహా" అని పాడుతోంది. హిందీపాటల్లో మొదలుపెట్టి ఆ వరసలలో ఆ మాటల్నే తెలుగులో వ్రాసిన ప్రస్తుతపు పాటల్లో ఎక్కడచూసినా యీ ప్రేమ అనే మాట అమితంగా వాడుతున్నారు. ప్రేమలోకం, ప్రేమమందిరం, ప్రేమమురళి, ప్రేమహృదయం, హృదయప్రేమ, ప్రేమప్రియుడు, యిట్లా. ఇట్లాంటి గోల వ్రాత ప్రారంభించిన పాపం నేనే చేశానేమో చాలా! కాని మాటలెట్లా వుపయోగించినా వాటివెనక ఏదో ఒక సంగతి నిశ్చితంగా చెప్పాలనే వేదన వుందినాకు. ఈ పాటల్లో యింకా కథలలోను గీతాలలోనూ, మాటలమీది ప్రేమ ఎక్కువగా కనపడుతుంది. ముఖ్యం ప్రేమమాటలమీద.

అందువల్లనే యీ పల్లెటూరి స్త్రీల fashions వలె యీ